...సము.





గ్రంథకర్త:

పింగళి లక్ష్మీనారాయణ,

బెజవాడ.

ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్, బెజవాడ.

1927.

 [వెల రు 1.

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు మంచిమందు

గొప్ప గొప్ప వారిచే వేలకువేలు

యోగ్యతాపత్రములు పొందియున్నది.



తలనొప్పుల మాన్పును, వాయుపోట్ల బాపును, పార్శ్వపునొప్పుల బారదోలును, పోట్ల బోగొట్టును, బెణుకుల భేదించును, వాపుల రూపుమాపును, దగ్గును తగ్గించును, దురదను తొలగించును.

ఈ మందును రుద్దగానే చెమట పట్టుటవలన శరీరమందలి దుష్టపదార్థములను తొలగించును. నొప్పులు తగ్గించును. నోటిపూతకు మంచిది. విదేశములలోగూడ వాడుచున్నారు.

అమృతాంజనము అన్నివిధములగు నొప్పులకు సంజీవివంటిది.

పంచభాష చీటీ చూచి కొనిన మోసము గలుగదు.

చక్కని డబ్బితో సహా సీసా 1-కి 0-10 0

డజను 1-కి రు 6-4-0 లు.

ప్రతియింట ముఖ్యముగా నుండదగినది.

## అమృతాంజనం డిపో

6, 7 తంబుశెట్టివీథి, మదరాసు,

249, ఫేరిరోడ్డు, ఫోర్టు, బొంబాయి.



# స్వసామ్రాజ్యవైభవము.

గ్రంథకర్త

పింగళి లక్ష్మీనారాయణ.



ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్, బెజవాడ.

1927.

 [వెల రు 1.

# పీఠిక

కర్జనుప్రభువు గావించిన నూతనచట్టములును వంగదేశవిభాగ మగుటయు జూచి ప్రజలు ఆంగ్లజాతియందుగల విశ్వాసమును గోల్పోయిరి. 1905 సంవత్సరాంతమున జాతియందొక కదలిక గలిగినది. ఇది యొక వత్సరములోనే మహోద్యమముగా బరిణమించినది. దీనిని స్వదేశోద్యమ మనియు, జాతీయోద్యమ మనియు బాల్, లాల్, పాలుద్యమమనియు ననిరి. ఈయుద్యమము అత్యున్నతమైన జాతీయభావములనుగలుగజేసి, శ్వేతజాతుల యౌన్నత్యము (Superiority) ను భావప్రపంచమందు భంగపరచుటయే గాక, రామమోహనురాయగారి నాటనుండియు క్రమముగా విజృంభించుచుండిన సంఘ సంస్కరణోద్యమమును బొత్తుగా నణచివేసెను. హైందవధర్మమును, ఆర్య సంతానమును మహోన్నత దృక్పథమున కీడ్చెను.

1908 సంవత్సరారంభముననే అధికారవర్గమువారి భయమును, నిరోధమును మేల్కొలిపినది. వెంటనేశిక్షాస్మృతిలోని 124 వ శెక్షనును ధారాళముగా రాష్ట్రములందు బ్రయోగించుటకు గవర్నర్లకు అధికార మొసగిరి. జులై నెలవచ్చుసరికి ప్రబోధము, ప్రచురణము, పత్రికలు అగిపోవలసివచ్చినది. అవకాశత యంతయు బోయినదని వంగదేశమందలి యువకులు గొందరు ఘాతుకకృత్యముల కొడిగట్టి బాంబువిధానమును బ్రయోగింప నారంభించిరి. అగస్టు సెప్టెంబరు నెలలలో స్వదేశమునుండి పరదేశమునకు వేలకొలది

చెల్లాచెదరైరి. అనేకవిధముల ననేకదిక్కులకు సర్కారిచేతి కందకుండ బోయిరి. కాని అనేకమంది అరెస్టుకాబడిరి. వేల మంది చెరసాల కంపబడిరి. అనేకులు ద్వీపాంతర వాసమున కంపబడిరి. కొందరుమాత్రమే ఉరిదీయబడిరి. అప్పుడు అన్య దేశములకు బోయినవారిలో గొందరిని గురించి ఇప్పటికిని భోగట్టాలేదు. పశ్చిమవిద్యలను పూర్తిగా నభ్యసించినవారు గొందరు విదేశములందు నివాస మేర్పరచుకొనిరి. చాల మంది అమెరికా, జపాను, జర్మని, ఫ్రాన్సులకుబోయి కూలి నాలి చేసికొని బ్రతుకుచుండిరి. అపు డంతటిభయము గలు గజేయబడెను.

1908 సంవత్సరాంతమున సింహళమునుండి పరాసుల రాజ్యము చేరితిని. మనదేశమునుండి యువకులు అప్పుడప్పుడు నాకడకు వచ్చుచుండెడివారు. వీరు నావద్దనున్న ఈపుస్త కమునకు ప్రతులు తయారుచేసికొని పోవుచుండిరి. ఇట్టి ప్రతులు నావద్ద రెండుండినవి. ఒకదానియందు మొదటి అధ్యాయములు లేవు. రెండవ ప్రతియందు అంత్యాధ్యా యములు లేవు. ఈరెంటిని సమకూర్చి ఈగ్రంథ మచ్చొ త్తించితిని.

ఈపుస్తకమందు పరిపూర్ణ స్వాతంత్ర్యము ప్రబోధింప బడినది. ఈయుద్యమమునుగురించి పూర్తిగా దెలియనివారు దీనితో బాంబువిధానమును జతపర్చుచుండెడివారు. ఇది గొప్పపొరపాటు. ఈయుద్యమమునందు జొచ్చినిన నాయకు లెవ్వరును ధర్మ విరుద్ధముగా భావములను బురికొల్పలేదు. లజపతిరాయి, కపర్దె, తిలకు మహాశయులు మంచి దైవభక్తి

గలవారు; అహింస, సత్యము, దయ, శాంతము ధర్మమునకు నాలుగు పాదములు. ఇందుకు విరుద్ధముగ యుద్యమము మన దేశస్థుల హృదయముల నంటజాలదు.

ఈపుస్తకములో నచ్చటచ్చట చిన్న చిన్న మార్పులు చేసినచో ప్రస్తుత సందర్భముల కుచితముగానుండునని గుర్తెరిగియు, వెనుకటి ఈయుద్యమము యొక్క హృదయమును చదువరులకు జూపుటయే నాకుండు ముఖ్యోద్దేశ్యము గనుక నొక అక్షరమైనను మార్పుచేయక అట్లే ప్రకటించితిని.

మన యాంధ్రదేశమందు బాంబులనుగురించిన కేసులు వేతనాభివృద్ధి నపేక్షించు పోలీసుద్యోగియులు కొందరు గల్పించినవని నామతము. మన యాంధ్రదేశమున నట్టి సంబంధము గలుగజేసికొనినవా రెవ్వరును, నెన్నడును, లేరనే నానమ్మకము.





# స్వసామ్రాజ్యవైభవము.

## మొదటి ప్రకరణము.

శ్లో॥ "అథచేత్త్వం ధర్మ్యమిమం సంగ్రామం నకరిష్యసి
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి"

నీవు ధర్మయుక్తమగు నీజీవితయుద్ధమును (అజ్ఞానముచేత) జేయక పోయినయెడల ధర్మము కీర్తియు పోఁగొట్టుకొనుటయేకాక నీవుఁబాపము గూడగలుగును. —గీత॥ ౨॥ 33॥

### తూర్పు — పడమర.

### వస్తుతత్వము—పరతత్వము.

జీవరాసి యంతయు జీవకాంక్షతో నిండియున్నది. లోకం బంతయు స్పర్థావైరంబులతో బ్రతిష్ఠితంబై యున్నది. జీవరాసియంతయు బ్రాణరక్షణమునం దభిమానము గలిగియున్నది. ఆపదలెక్కువైనకొలది స్పర్థావైరంబులు పెంపొందినకొలది జీవకాంక్ష దినదిన మభివృద్ధి నొందుచున్నది. ప్రతిజీవియు దనజీవము సాధ్యమైనంత దీర్ఘముగానేకాక సాధ్యమైనంత విశాలముగా గూడ నుండవలయునని ప్రయత్నించు చుండును. జీవమును జీవికసాధనములను సాధించుటకు మానవకోటి యంతయు ననుదినము గర్మబంధచక్రంబున గిరగిరందిరుగు

చున్నది. కాని మృత్యువు దినదినము భూభారమును తగ్గించుచున్నది. మనుజుండు వస్తుకాంక్షచేత జీవికసంపదల వెంటదగులుచుండును. జీవకాంక్షవల్ల నీషణత్రయంబులకును వీనిని తృప్తిపరచుట కుద్యమించి అరిషడ్వర్గంబులకును వశమగుచున్నాడు. వీనిచే మానవ సంతానంబులు చతుర్దశేంద్రియ వృత్తులకును, నానావిధ కర్మంబులకును కర్మఫలాచయంబులకును నీడ్వబడుచున్నారు. (గీత 1-62) ఇందుచే జీవంబు రోగమృత్యుభయగ్రస్తంబై దరిద్రపీడితంబై దుఃఖ దావానల సమావృతంబగుచున్నది. సంసారదుఃఖసాగరంబున మునిగియుండునట్టి మానవుం డాత్మపరిభావంబుల నాలోచించుటకును తన సహజసద్గుణముల దెలిసికొని జ్ఞానానంద మయుండగుట కవకాశత నొందజాలడాయెను. సకలార్థసాధనంబగు శరీరమును సుగుణనికాయంబుగా జేసికొనక కేవలపశువువలె కుక్షింభరత్వమున కర్పించుచుండెను. లోకానుజాతంబగు నీస్పర్థ మనుజు నెడబాయక వెంబడించుచున్నది. లోకంబులు పరస్పరనైసర్గికశక్తులచేతను, జంతువర్గంబులు స్పర్థావైరంబులచేతను, నిరంతర చలనంబు నొందుచున్నయవి. ఉపమించినచో నీధర్మంబు దేటబడును. ఒకకుటుంబమువారు రెండుశేర్ల బియ్యముమాత్ర మార్జించి తమనిత్యజీవనము గడుపుకొనుచుండిరని యూహింతము. సంతతి వృద్ధిజెందినకొలది తమకుండు మితభోజ్యములను కుటుంబమంతయు బంచుకొనవలసి యున్నది.

ఇవ్విధమున వారికుటుంబము పెంపొందినకొలది వారి సుఖములు తగ్గిపోవుచుండును. ఏగ్రామమునందైన నొకశిల్పి చక్కగ జీవించుచుండెనని వినినంతనె వారికులమువారు వది

కొందరు బ్రతుకుటకా గ్రామము జేరుదురు పనివాండ్రు పెరిగినకొలది మొదటివానికి పనితగ్గిపోవుచున్నది. వాడు వెనుకటి సౌఖ్యముల బొందుటలేదు. వీరందరికిఁ దగునంతగా నా గ్రామములో పని పెరుగకుండినయెడ వారందరు దరిద్రులై బిచ్చ మెత్తుకొనవలసివచ్చును. వీరి జీవితసాధనములు తగ్గినకొలది కుటుంబములు కష్టములపాలైనకొలది శరీరములు నిస్సారములగును. పిల్లలు బలహీనులై స్వల్పాయుష్మంతులై యుందురు. దరిద్రమున గృశించుచున్న తలిదండ్రులు తమ పిల్లలకు విద్యల గరిపింపజాలరు. ఇట్టి దరిద్రు లధికమైనకొలది జాతియంతయు క్షీణించును. ముగ్గురుపిల్లలు గలిగి తనశక్తి యుక్తులనెల్ల వినియోగించి మిక్కిలి జాగ్రతతో విద్యాప్రజ్ఞల నివ్వగలవారి కార్గురుపిల్ల లుండినయెడ వాని పిల్లలందరును గూడ వెనుకటియంత విద్యాసుఖముల బొందజాలరు. వారు లేమిచే విద్యల నభ్యసింప కుండుటయేగాక వారి శరీరములు నిస్సారములగుటచే రోగపీడితులై విచారమును వృద్ధి చేయుచుందురు. కుటుంబములవలెనే గ్రామములును దేశములును జీవికసాధనములను దగునంతగా బొందకుండుటచే బెక్కు కష్టములపాలగుచున్నారు.

ఇట్లు జీవకాంక్షవల్లను వస్తుప్రాప్తి మితమగుట వల్లను స్పర్థావైరములు నానాటికి నాగరకత వ్యాపించినకొలది నూతనాకారముల దాల్చి తమ తీక్ష్ణతేజములచే క్రొత్త బాధల గుప్ప తిప్పలుగ గల్పించు చున్నవి. ఈ వైరం బనేక విధంబుల వ్యష్టి సమష్టి జీవితకృత్యంబులందు వెలువడుచున్నది. శునకమునందు స్వజాతి వైరము, సర్పములందు విజాతివైరము

సూకరములందు స్వవృత్తి వైరము, కాని నాగరకులందు చతుర్దశవిధవైరంబులును సంక్రమించు చున్నవి. వారి దుష్టనికర చేష్టాచయంబు లనంతంబులు. నాగరకత కొన్ని పశ్చిమదేశములందు ఘోరరూపముల దాల్చి యున్నది. వారికి హాతప్రతిహాతంబులు పురుషార్థంబులు. పాశ్చాత్యులలో కొందరి దురభిమానవృత్తులచే లోకమందు శాంతము నశించినది, అన్యస్వాపహారణమే పరమధర్మ మగుచున్నది.

భారతజాతిమాత్రి మత్రసన్యాసము నొంది సాత్విక గుణముల చేతను శాంతవృత్తుల చేతను భౌతిక జీవమును మరచి ఆధ్యాత్మిక లోకమందే తన జాతీయప్రాణము బ్రతిష్ఠచేసి జ్ఞానవైరాగ్యానందమున నోలలాడుచుండెను. భారత మాతా! దేశమునకు దూరమై తల దాచుకొన జోటుగానని పారశీకులను సందిట జేర్చుకొని వారిని నీపవిత్రసంతతికైన జూపని ప్రేమాతిశయమున బెంచి పెద్దజేసి సర్వసంపదల నొసగితివి. జీవిక సాధనముల గానక లోకమంతయు దిరుగుచుండు కొల్లరులనెల్ల రాబట్టి నీ ధననిధులను, ధాన్యరాసులను కోరినవారికి కోరినంతగా నర్పించి దానమే పరమధర్మమని నీ సంతతి నోడార్చుచుంటివి. నీధర్మము నీజ్ఞానతేజము దేశదేశములందు వీరిపూర్వకముగా నిప్పటికి వెలుగుచున్నది. నీధనముచే నితరులు ధనవంతులైరి. నీజ్ఞానధర్మములచే నితరులు విద్యావైభవముల గాంచిరి. నీశక్తులచే నితరులు శక్తివంతు లగుచుండిరి. నీధనము, నీవిద్యలు లోకముల మేల్కొలిపెను.

భరతవర్షము భూలోకమున కంతకు సర్వార్థసూచకముగా నెంచబడుచున్నది. ఏ భాష చదివినను ఏ శాస్త్రమును

పరిశీలించినను మన దేశ సంబంధము లేకుండుట లేదు. విశ్వ మానవజాతిచరిత్రయొక్క పూర్వోత్తరభాగములం దెల్లెడలను ఈ పుణ్యజాతినే పేర్కొనుచుండిరి. మానవజాతి కంతకు నీదేశము కామధేనువుగా నెంచబడు చున్నది. ఈ వేల్పుటావును వెదకుటకు పశ్చిమఖండమంతయు నొకప్పుడు కలవరమొందెను. దీనిని వెదకుటకు బయలుదేరినవా రొక రమెరికాను మరియొక రాఫ్రికాను, ఇంకొకరు భూమ్యోత్తరప్రాంతములను బట్టుకొనిరి. ఈ దేశముతో వాణిజ్యాది లాభముల బొందుటకు పాశ్చాత్యు లొకరితో నొకరు పోరాడుకొనిరి. వారి జాతీయ వ్యాప్తులకును వారి శక్తివిజృంభణములకును భరతవర్షమే మూలసాధనము. భారతజాతిని వశపరచుకొని ఇంగ్లాండు వన్నెకెక్కెను. మనదేశమున కాశించి రష్యా దేశము తన శక్తుల బెంచుకొనెను. వారు నూరేండ్లొకే దీక్షను మనకొరకు జపతపముల చేయుచుండిరట. కాని వారి కీదేశము లభింప కున్నను వారిశక్తి ప్రబల మాయెను. మనల దలపక ఒలాందావా రిప్పటికి తమ కీర్తి ప్రతాపముల జెప్పుకొన జాలరు. మానవజాతి యంతయు మనకు ఋణపడియున్నది. దేశదేశములందును ద్వీపద్వీపములందును గానవచ్చు శిలాశాసనములును శిథిలములును భారతజాతి ననంతముగా గొనియాడు చున్నవి. మన మనాదినుండియు నన్ని దేశములకు బోవుచుంటిమి. మన జ్ఞానసారముతో లోకమును నివాసయోగ్యముగా జేయుచుంటిమి. కాని మనమిప్పుడు పరజాతుల పాలనముక్రింద యుండుటకు గతంబెద్ది? మన మే దేశములను కొల్లగొని యుండలేదు. మన మెన్ని దేశముల కేగినను దండ

కమండలువులను వీపునవైచుకొని పోతిమేగాని కత్తి చేబట్టి యుండలేదు. అశోకుడు తన కుటుంబమువారి నన్యదేశములకంపెనట. వేలకొలది బోధకులను భూభాగములకెల్ల బంపెనట. వారివెంట నేసైన్యములును బోయియుండలేదు. రాముడు రావణునిగూల్చి రాజ్యము విభీషణునికొసగెను సర్వసంపదలకాలవాలమైన సింహళమునుండి రాము డేమియు దెచ్చియుండలేదు మనము తన్నినవారి నెల్ల దీవించుచుంటిమి. "సర్వేజనాస్సుఖినోభవంతు" అని దినదినము చెప్పుచుంటిమి. లోకము న్యాయధర్మముల దప్పకుండవలయునని దినదినము ధ్యానము చేయుచుంటిమి! భారతసంతాన మిట్లు పతితులై వ్యాహతులగుటకు కారణమేమి? ముక్తిమార్గమెద్ది?



# రెండవ ప్రకరణము

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత
అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥

ఓ అర్జునా! పదార్థముల కన్నిటికి నవస్థాభేదముచే నుత్పత్తిస్థితినాశములు కలవు. అట్టిపదార్థములయొక్క యాదిమధ్యాంతములు నీకు దెలియవు. ఈవిషయమయి నీకు దుఃఖమెందుకు?

—భ॥ గీ॥ 2-అ-28 శ్లో.

## సంస్కరణ సిద్ధాంతము.

అభివృద్ధియనగా నేమి? నాగరకతయనగా నేమి? పాశ్చాత్యులు నాగరకులట! ఆసియాఖండమువారు పతితులట! చైనావారు జపానువారిధిక్కారములకు దొడగొట్టి లేచుచుండిరట! ఆఫ్రికావా రనాగరకులట! నాగరకతకు బ్రమాణమెద్ది? స్వతంత్రపాలనమా? ఆఫ్రికావా రనేకులు స్వపరిపాలనము జేసికొనుచు నాదిమావస్థ లందే యున్నారు. చైనావా రెన్నడు నితరులచే పాలింపబడియుండలేదు హిందువు లిరువది శతాబ్దములనుండి పతితులై యుండిరట. ఇరువది శతాబ్దములక్రిందట హిమాలయ వింధ్యపర్వతములమధ్యదేశమం దార్యులు నివసించుచుండిరి. వారప్పటికి దక్షిణదేశమునందు వ్యాపించి యుండలేదు. దక్కనుదేశ మనబడు దక్షిణదేశమందు జను లంతగాలేరు. కావేరి కటుప్రక్కనుమాత్రము కొన్ని ద్రావిడ జాతు లుండెడివి. వారును నాగరకులే; కాని కావేరీతపతీనదుల మధ్య జను లంతగా లేరు. దేశమంతయు నరణ్యములతో నిండి

యుండెను. ఈపతితయుగమునందు భారతసంతానము క్రమ ముగా వృద్ధిజెంది నూతనప్రదేశములకు వ్యాపించుచుండెను. నూతనపట్టణములను గట్టుచుండెను. ఇట్లార్యజాతి ఆసేతు హిమాచల పర్యంతము వ్యాపించుచుండెడిది. నూతనరాజ్య ముల గట్టుచుండినది.

దేశభాషల నభివృద్ధిజేసి సంస్కృతముతో సమానమగు నట్లు జేసెను. పూర్వ ధర్మప్రకటనమువల్ల దేశీయభాషలకు నిత్యజీవము నొసగినది. నానాజాతులను తనగర్భమున జేర్చు కొని వారివారి కుచితమగు వివిధధర్మపథసోపానముల గా వించుచున్నది. గౌతమబుద్ధుడు, అశోకుడు, చాణక్య చంద్ర గుప్తులు, కాళిదాసు, విక్రమార్కుడు, భోజుడు, భవభూతి, శంకర శాలివాహనులు, రామానుజులు, ప్రతాపరుద్రుడు, సారంగధరుడు, విద్యారణ్యులు, కృష్ణదేవరాయలు, శివాజీ, మొదలగు మహాపురుషుల చరిత్రలతో నీపతితయుగ మలంక రింపబడినది. నాగరకతకు లక్షణమేమి? దానిప్రమాణ మెద్ది యో మేము గానకున్నాము. ప్రతిశతాబ్దమువారును, ప్రతి దేశమువారును దాము నాగరకులమని తలంచుచుండిరి. మన జాతికి నిండియాదేశము చాలక జావా, బార్నియో, సింహళము న్యూజిలండు, దక్షిణాఫ్రికా, బర్మా, అస్సాము మున్నగు దేశముల వ్యాపించుచున్నది. ఈజాతీయవ్యాప్తివల్ల విజా తీయ సంపర్కము గలుగుచుండెను. ఉన్నతనాగరకతగలయా ర్యులు వీరితో గలసిమెలసి యుంటుండిరి. కడచిన యిరువది శతాబ్దములందు నార్యజాతితో ననేకజాతులు గలసి యొక మహాజాతిగా మారిపోయెను. ఇందువలన ననేక సాంఘికవైక

ల్యములు గలుగుచుండెను. ఇంతటి జాతీయవ్యాప్తి మానవ చరిత్రలందు నిరుపమానము. ఆంగ్లేయజాతి మూడువందల సంవత్సరములనుండి మాత్రము విస్తారముగా వ్యాపించుచున్నది. జాతీయవ్యాప్తి నాగరకతకు ప్రమాణమేనా? మనవారు దినదినము నితరదేశములకు గుంపులుగుంపులుగా బోవుచున్నారు. దీనిని నాగరకతాసూచకముగా నెంచవచ్చునా? కాదు. వీరివెంట ఖడ్గబలము బోవుచుండుటలేదు. ప్రతివత్సరము నీ ప్రతీయమాన పతితయుగమందు నూతనతటాకములు త్రవ్వబడుచుండెడివి. బావు లనేకములుగా దీయబడుచుండెడివి. అడవులరూపుమాపి గ్రామములను, పట్టణములను, గట్టుచుండిరి. పంటలంతకంతకు మొత్తముమీద వృద్ధిజెందుచుండెడివి. కరవులనెప్పు డెరుగరట. మనవెనుకటిగ్రంథములం దిప్పటి క్షామములవంటి క్షామములను వర్ణించియుండలేదు. స్వల్పక్షామములరుదుగా వచ్చుచుండినను దేశమొత్తమున బంటల సముదాయము హెచ్చుచునే యుండెడిదట. ధాన్యజాతు లనేకములు బండింపబడుచుండెడివి. ధాన్యరాసులు నాగరకతను సూచించునా? లేదు. మనపొలముల నెద్దులు దున్నుచున్నవి. ఎడ్లను భక్షించి గుర్రములచే నినుపనాగలిగట్టి దున్నినచో నది నాగరకతయగునా? మనదేశమందు కూలివిలువ లేకుండెను. ధాన్యము మిక్కిలి స్వల్పవిలువ గలిగియుండెను. కట్టడములకు వలయు గేహసాధనములు స్వల్పవిలువ గలిగియుండెను. దొంగతనములు, బందిపోటులును లేవు. ఇనుపపెట్టెలును లేవు. ధనికులందు దానధర్మము లంతరింపలేదు. వస్తులేమిలేదు. వ కాంక్షయును లేదు. గుప్పెడన్నముకొర కారామడదూరము

బంట్రోతుపనికి బోనక్కర లేదు. పన్నులుస్వల్పము. వాటినికొద్ది మందిమాత్రమె వసూలుజేయుచుండిరి. వీరివేతనములు స్వల్పములు. పంచాయతీలచే గ్రామవివాదములదీర్చుకొనుచుండిరి. వివాదములరుదు. న్యాయస్థానములరుదు. వ్యాధులరుదు. ధర్మవైద్యులనేకులుండిరి. పెద్దపట్టణముల గట్టుచుండెడివారు. విదేశవాణిజ్యము స్వల్పము. రేవుపట్టణము లరుదు. దిగుమతులు సున్న. ఆనకట్టల నెక్కువగా గట్టియుండ లేదు. వర్షములు చాలియుండెడివి. పశువులు స్వల్పవిలువగలిగియుండెను. పశుదానము భూదానము తరుచు; విక్రయము లరుదు. అన్నవిక్రయము లేదు. అనృతమరుదు. రిజిస్ట్రరుకచేరీలులేవు; బొటనవ్రేలిముద్రలను దీసియెరుగరు. విద్వాంసులు మట్టిప్రమిదలలో కొంచెము ఆముదముంచి సిద్ధాంతములను, భాష్యములను, సూత్రములను, గావ్యములను, వ్రాసెడివారు. నాలుగుపుల్లలను, రెండుబద్దల నొకపలకతోగూర్చి గజముపదిరూపాయిల విలువగల వస్త్రములను గోతిలోగూర్చుండు సాలెవాండ్రునేయుచుండిరి. ఆనాటి వారి యాదాయవ్యయములు స్వల్పములు. వారియార్థికప్రమాణము లోకమం దెచ్చటను గానరాదు. శంకరులు మోటారుబండి నెక్కియుండ లేదు. చంద్రగుప్తుడు మననాటి ఫిరంగుల వాడియుండ లేదు. సంగ్రామ సాధనములందు వారు మనయంతటి నాగరకులుగారు. విక్రమాదిత్యుడు మందుగుండు సామానుల నెరుగకుండవచ్చును. శివాజీ టార్పిడోబోటు నెరుగడు. పోతనకవి రైలుబండిని జూచియుండ లేదు. శాయనమాధవులు వృక్షశాస్త్రమును వివరించియుండ లేదు. మన్మథుడు సబ్బుల వాడియుండ లేదు. కుబేరుడు హుండీల

బంపుటెరుగడు. వినాయకుడు బైసికి లెక్కజాలడు. శుకుడు తెల్లమల్లు గట్టియెరుగడు. మనువు జీవశాస్త్రము నెరుగడు. అశోకుడు పొగయోడను జూచియెరుగడు. కృష్ణదేవరాయలు కోటలుగూల్చుయంత్రముల నెరుగడు. పిచ్చిలోకమా! నాగరకత యననేమి? పాశ్చాత్యులారా! నాగరకతయననేమి? జర్మనీదేశపువారు గొప్ప నాగరకులట! వారిభాష మిగుల గౌరవనీయమట. ఆంధ్రభాషంతటిది కాదట! భేదమేమి? ఖడ్గబలము. ఖడ్గబలముతో గూడియుండనిదంతయు వ్యర్థము. నాగరకత కత్తులవాడియా? పరపీడనమా? సబ్బులలోని సుగంధమా? పతితయుగమనననేమి? జీవితమంతయు బతనోద్ధానముల తోనిండియున్నది. మనము నడచునంతవరకు ముందుకుబడుచు నేయుందుము. పాదము లొకదానికొకటితోడ్పడి నడకనుగలుగ జేయుచున్నవి. యోధజయము నాగరకతచిహ్నము కాబోలు! మనల నోడించిన తురుష్కులు మనయంతటి నాగరకులు గాజాలరు.

లోకము కర్మప్రతికర్మములతో నిండియున్నది. మానవజాతి యంతయు కర్మజేయుచున్నది. మనుజుండు గాంక్షచేత కర్మమున కీడ్వబడుచున్నాడు; సంచిత వర్తమానకర్మ ఫలముల ననుభవించు చున్నాడు. వాని కనుగుణ్యమగు కర్మల నాశ్రయించును. అభిలాష పలువిధముల బ్రసరించుచున్నది. జీవితంబు విషయాపేక్షపూరితంబగుటచే కామ మనేకరూపములదాల్చి మనుజు ననేకవృత్తులకు బురికొల్పుచున్నది. ప్రతి మనుజుండును మూర్తిభవించిన దైవమే. మనుజునిశక్తిజీవములనంతములు.

అభిమానముచే లోకం బభివృద్ధి జెందుచున్నయది జ్ఞానులు విధిజ్ఞులు గనుక తనువిధుల నిష్కామముగా జేయుచుందురు. కుటుంబాభిమానముచే గుటుంబములును కులాభిమానముచే గులములును దేశాభిమానముచే దేశములును సార్థకము లగుచున్నవి. కీర్తికాంక్షచే మరికొందరు బనిచేయుచున్నారు. జ్ఞాని ధర్మముకొరకు ధర్మము ననుష్టించుచున్నాడు; మానవజాతి నంతయు మూర్తీభవించిన దైవమునుగా జూచుచుండును. ప్రతిమనుజుడు వాని కర్మగుణసంచితముల ననుసరించి విధులను గలిగియున్నాడు. సోమరులు జన్మమును సార్థకము జేసికొనుచుండుటలేదు (భ॥గీ॥ 3-36). ఈపణత్రయమున జిక్కి పెక్కుమంది ధర్మము నెడబాసి వ్యర్థులగుచున్నారు. మనుజులందరు దమ నిజవిధివిధానములందు సమానులని తెలిసికొనవలయును. ప్రభువులును పరిచారకులును సమానులే. ఆధ్యాత్మిక భౌతిక జీవములం దందరును సమానులే. వారికర్మ పరస్పరతచే కార్యములు సమకూరుచున్నయవి. కర్మము ననుష్ఠింపనివారందరు శరీరయాత్రయందు మార్గభంగము నొందుచున్నారు (గీత. 3-8). ప్రతిమనుజుడు తనవిద్యాశక్తులను గుణసాంప్రదాయములను దెలిసికొని తనబుద్ధికి దోచినటుల ధర్మానుష్ఠానమునకు దోడ్పడవలయును. ఇదియే స్వధర్మము. దీని నెవడును దప్పరాదు. స్వధర్మమే ప్రతివానికి నుత్తమ ధర్మము (గీత 3-35). కొందరు దేశాభిమానమును, బరోపకారమును బోధించుచున్నారు. నాచిన్ననాటనుండియు నీసుద్దుల వినుటకు బ్రాణము విసుగుచున్నది. పరోపకారము జేయగలవాడెవ్వడు ? పరులెవ్వరు ? ఉపకారమెందుకు ? మానవ

జాతి చండాల గోరుచుండుటలేదు. దైవము మనబిచ్చముల కాశించుటలేదు. దైవము, ధర్మము స్వశక్తులచే బోషించుకొనగలరు. దైవము, మానవజాతియు, మనదయాదాక్షిణ్యముల కాశించియుండలేదు. కొందరుధనికులు నూరుమందికొకనాడన్న మొసగి పత్రికలలోనెల్ల బ్రకటించుకొనుచుందురు. కొందరు ముందుగతుల సపేక్షించి తమదానములను బెట్టుబడిగా జూచుకొనుచుందురు. పెట్టువానికి బెట్టునంతయని విప్రులింటింట జాటుచున్నారు. ఆత్మ యనంతం ఆత్మ యవిభాజ్యం. లోకావశ్యకములు ముక్తి సాధకములు. నిష్ఠలు నీతి వ్యాయామములు. ఆత్మీయసత్యమును బ్రతిష్ఠజేయుచున్నవి. మానవజాతి నిత్య పరిపూర్ణతనుగలిగి యున్నది. ప్రతి యుగమందును ప్రతిదేశమందును నూతనావశ్యకములు గలుగుచున్నయవి. నూతనోద్యమములు ప్రబల మగుచున్నవి.

మానవజాతి యొక నదిని బోలియున్నది. దాని యాద్యంతము లందరికిని స్పష్టముగాకున్నయవి. దాని ప్రవాహమెడతెగకున్నను జలములు ప్రతినిమిషమునను మారుచున్నవి. దాని గమనము దిక్కులు క్రమముగా మారుచున్నయవి. దాని నామరూపములు మారుచుండినటుల గనిపింపవు. వానియందు వెనుకనుండిన లంకలంతరించినవి. క్రొత్తలంక లుత్పన్నమగుచున్నవి. దానికట్టలును ముందువెనుకకు జరుపబడుచున్నవి. ఇట్లనే మానవజాతియు రూపాంతరముల జెందుచున్నటుల కనుపింపకయు ప్రతినిమిషమునను మారుచున్నయది. మనుజునం దనుదినము శరీరమానసిక మార్పులనేకములు గలుగుచున్నవి. అలవాటుచే మనుజు డిది గానకు

స్నాడు. మనుజులందరు తమ జీవితకృత్యములందెల్ల మూర్ఖానందాసక్తులై యున్నారు. మనుజుండు దన్నుదామరచి యింద్రియములతో నైక్యముజెంది యవస్థావశమై మార్పులను గుర్తింపజాలకున్నాడు. విజ్ఞానమునకు భౌతికానుభవము సాధనము. చెవిదగ్గరనుండు తుమ్మెదనినదమువలన దూరముననున్న మేఘగర్జనమును వినజాలకున్నాము. కలకత్తాలో గొందరరాజకు లురిదీయబడిరట. పత్రికలలో జదివి యచ్చెరువొందితిమి. క్షయరోగ పీడితుడగు కుమారునిజూచి దుఃఖించుచుంటిమి. వంగదేశమందు వందలాదిజనులు చెరసాలకీడ్వబడిరట. ఈ మాటను విని మరచితిమి. మన గ్రామములో నొకనికదే యవస్థ సంభవించినపుడు మనమందరము నిశ్చేష్టతనొందితిమి. మనస్నేహితుని దుర్దశ శూలమువలె గుండె నవియగొట్టుచున్నది. మరచినను మరపురాకున్నది. ఏసుక్రీస్తు సిలువవేయబడెనను తలపు మనమున బొడమినపుడెల్ల క్రైస్తవభక్తుడు గంట నీరుగార్చును. హిందువు విని తలయూచును; కాని పాండవుల యజ్ఞాతవాసమును దలచినవెంటనే వగచుచుండును. మనోభావములు వ్యక్త్యనుభవమును, సాంఘికసాంప్రదాయాది గుణముల ననుసరించియుండును. కాని ఏకరూపముగల రెండుపండ్ల నేచెట్టునను జూడజాలము. ఏకరూపులగు నిద్దరి మనుజుల నేజాతియందును గానము. సాంప్రదాయాది పరివేష్టితావస్థల సమరూపతచే బ్రతివ్యక్తియు, ప్రతిజాతియు స్వకీయగుణముల గలిగియుండును. ఈ ధర్మముచే వ్యష్టిసమష్టిజీవితము లనురూపములగలిగి యనన్యస్వతను ప్రతిష్ఠచేయుచున్నవి. ఇందువలన వ్యష్టిజీవమంతయు

సమష్టిజీవమందును సమష్టిజీవము వ్యష్టిజీవమందును ప్రతిబింబించుచున్నవి. మనుజుండు సంచితవర్తమానికఫలముల ననుభవించుచున్నాడు. మన పొలములన్నియు నొకప్పుడడవులుగానుండెడివి. వాటిని మన పూర్వులు కృషియోగ్యములుగా జేసిరి. మన పట్టణములు, గృహములు, నితరులచే నిర్మింపబడియున్నవి. మన మభ్యసించువిద్యలనేకతరములవారి కర్మసంచితములు. మనముచ్చరించు శబ్దములన్నియు వెనుకటితరముల వారి యనుభవచయముచే పరిశుద్ధిజేయబడినవి. మన జీవితమందలి పవిత్రతయంతయు వెనుకటితరములవారి ధర్మానుష్ఠానముల ఫలితము. మనము ముందుతరములవారికొరకనేక పనులను జేయుచున్నాము. కర్మభార మెప్పుడు నొకటియే. మన పూర్వులు మోసిన బరువును మనమెత్తుకొనిమోయుచున్నాము. మన భారమును మనకుముందువారి కొప్పజెప్పి పోవుచుందుము. ఈ భారమును వహించనివా డెవడును లేడు. కొందరు మైమరచి కార్యభారమును బూనుచున్నారు. మరి కొందరు ధర్మమార్గముల దెలిసికొని బుద్ధిపూర్వకముగా బూనుచున్నారు. కొందరు దురభిమానములచే నీకార్యభారమునే వహించుచున్నారు. విశ్వము మనోమయమైయున్నది. సర్వవ్యాపియగు నీమహామనము ప్రతిజీవియందును బ్రకాశించుచున్నది. మనయందరి మనసులును దీనిశాఖలుగా బరిణమించుచున్నవి. ఇందువలననే మనవారు విష్ణువు విశ్వంభరుడనియు, విశ్వరూపుడనియు, బ్రహ్మ విశ్వతోముఖుడనియు, జెప్పుచుందురు. ఈవిశ్వమయమానసిక సాగరమునందుండి యనేక సంకల్పతరంగములు జీవులలోనికి బ్రవహించుచున్నవి.

ప్రతి తరంగము బూర్వాచారకర్మబంధములచే నిస్సారమైన మానవజాతిని జ్ఞానసత్వముచే ఫలవంతముగా జేయుచున్న యది. ప్రతిజ్ఞానోల్బణము నూతనాదర్శనములు లోకమునకు నూతనదర్శనముల నిచ్చుచున్నది. నూతనదర్శనములు నూతనాభిప్రాయములను నవసంకల్పములను నవీనోద్యమములను బురికొల్పుచున్నవి. ఇందువలన లోకంబెప్పుడు నభిరుచికరం బగుచున్నది. ఈవిధమున ధర్మమెప్పుడును సారవంతమగు చున్నది. లోకంబు బుద్ధిశక్తుల విజృంభణముల కాధారమగు చున్నది జీవితము సమయములతో పరిగతమగుచున్నది. ఐనను ఈలోకము సర్వశక్తిసంయుతంబై నానాగుణపూరితంబై నిత్యపూర్ణతగలిగియున్నది. దానికి మనము జేయునదేదియు లేదు. ఇందువలననే పార్వతి నిత్యకన్యయని చెప్పుదురు. నీతియంతయు మనోనిశ్చయసారము నపుంసకునికి ఉన్మత్తునికి, నశక్తునికి, నీతిశిక్షలుండజాలవు. మనోనిశ్చయము లేని నీతి వ్యర్థము. నీతి శిక్షసాధనము. నీతిశిక్షలచే జీవుడు ముక్తిగాంచును సాంప్రదాయాదులచే సంచితంబగు సుగుణములు నీతిచిహ్నములు గానేరవు. ఆచారలబ్ధమైనది నీతిగాదు. భౌతికలాభముల నాసించునది నీతిగానేరదు. నీతి యిష్టాశిష్టితమై యుండవలెను. స్వతంత్రము నీతికి మూలాధారము. మనోనిశ్చయముచే బ్రతిష్ఠితంబైనదే నీతి గుణములు నీతిచిహ్నములు. నీతిసారమే నాగరికత. నైతికశక్తి విజృంభణమే యభివృద్ధి.

మనయందిట్టి నీతిగలదా? మనజాతి యుత్తమ నీతి గుణములచే బ్రకాశించుచున్నదియా? మనశరీరము రోమావృతమై యున్నది. మనుజుని పూర్వీకులు రోమావృతమైన శరీరముల

గలిగియుండిరి. ఇందువలన మన శరీరములందునుగూడ వెండ్రుకలు గానవచ్చును. వీటియుపయోగము మానవులం దంతకంతకు దగ్గిపోవుచున్నది. వాటిసంరక్షణయందు మనశ్రద్ధ నావంతయు నొసగుటలేదు. మననీతియునట్లనె. మనలను వదలకున్నది. మనజీవితమంతయు నాచారబద్ధమై యున్నది. మనజాతి స్తబ్ధత నొందియున్నది. మనశక్తులు నిస్సారమై యున్నవి. మన జీవితమున కభిరుచికరమగు నీతి యెద్దియో విచారింపుము. దాని గుణము లెవ్వియో పరిశీలింపుడు.



# మూడవ ప్రకరణము



శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతి స్థానికర్షతి॥
శ్లో॥ శ్రోత్రంచక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే॥

—భగవద్గీత

తా॥ నాశములేని నాయంశమే ప్రపంచమునందు జీవ రూపమయియున్నది. ప్రకృతికి సంబంధించినదియు, మనస్సుతో గూడియున్నదియు నగు జ్ఞానేంద్రియము ఆజీవుని ప్రపంచవిషయములందు నాకర్షించుచున్నది. ఇట్టి జీవుడు జ్ఞానేంద్రియంబులగు త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, రసనము, ఘ్రాణము, అను పంచేంద్రియములను మనస్సును అధిష్ఠించి ఇంద్రియవిషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను అనుభవించుచున్నాడు.

## సంస్కరణ విధానము.

(మానవస్థాపనములు అనుభవముచే సిద్ధించును)

సకలధర్మములకు శరీరము ముఖ్యసాధనము. శరీరమన్నముచే బోషింపబడుచున్నది. కనుక వస్తుసంగ్రహణమునందభిమానము గలుగుచున్నది. దేశకాలములు, మానవశక్తియుక్తులు, నవస్థాభేదముల నొందుచుండుటచే ధనధాన్యముల నెక్కువగా గూడబెట్ట వలసివచ్చుచున్నది. వస్తుప్రాప్తి

మితమగుటచే వస్తుస్వామ్యము రక్షింపబడవలసి యున్నది. వస్తుకాంక్షచేతను కామాదులచేతను వైరము గలుగుచుండుటవలన ప్రాణరక్షణము ముఖ్యమగుచున్నది. ప్రతిమనుజుడు దనజీవితావశ్యకముల నన్నిటిని స్వయముగా జేసికొనుట కశక్తత గలిగియుండనందున పరస్పరత విధియగు చున్నది. మనుజులు మానవసంఘములు, నిట్లన్యోన్యానుబద్ధమగు చున్నయవి. పరస్పర సంబంధములందు వివాదములు గలుగుచున్నవి. విధివిశేషముల నిర్ణయము ముఖ్యమగు చున్నది. పొలములలోని పైరుపంట లన్యాక్రాంతము గాకుండినగాని సేద్యగాడు వ్యవసాయము జేయడు. పొలమునుండి వచ్చువరకు వాని గేహాదులు సురక్షితముగ నుండునని నమ్మినగాని పొలమునకు బోజాలడు. ఇట్లనే లోకవ్యవహారికములన్నియు గ్రమపరుపబడవలయును. ఇట్టి సాంఘికావశ్యముల కనుకూలమగు పాలన యుండినగాని నీతివ్యాయామములును, ధర్మానుష్ఠానములును, సార్థకములు గానేరవు ఇందువలన పాలన మత్యావశ్యక మగుచున్నది. ఈ పరిపాలనమార్గములు సాంఘికావశ్యముల కనురూపముల దాల్చియుండవలయును. రాజులు, రాజ్యాంగములు, రాజ్యతంత్రములును ధర్మములకును, నీతివ్యాయామములకు, నాధీనములగుచున్నవి మానవాభిప్రాయములు, మానవధర్మములు, సాంఘికావస్థలు, నెడతెగక మార్పుజెందుచున్నందున వీటి కుపకరణములగు రాజ్యాంగనిర్ణయములును మార్పులు జెందుచుండును. ఇచటరాజ్యాంగనిర్ణయములను గురించియు వాటిసంస్కరణ విధానములను

గురించియు, పరిశీలింతము. వాటినిగురించి దురభిప్రాయము లనేకములు గలవు.

పాలనపద్ధతులను గురించిన సిద్ధాంతము ద్వివిధముగా నున్నది. కొందరు పాలనపద్ధతులే పరమార్థములనియును మరికొందరు పాలనపద్ధతులు పరమార్థమునకు సాధనములు మాత్రమేయనియును జెప్పెదరు. మానవకోటియందు సుఖ సంపదలను బెంపొందజేయుటయే రాజ్యాంగ సిద్ధియనియును, అట్టియాదర్శమును సాధించుటకు పాలనపద్ధతులను వీలైనటుల మార్చుకొనవచ్చుననియును, సాధారణముగా నమ్మబడును. రాజకీయస్థాపనములు కేవలము మానవకల్పితములనుట యనుభవసిద్ధము. మానవకల్పితములై యుండుటంజేసి యవసరము వచ్చినపుడు మానవులే సంస్కరణాధికారులనుట యుక్తియుక్తము. కనుక రాజ్యాంగముల స్వరూప స్వభావములను బరిశోధించి నిర్ణయించుటయే మనకు నిపుడుముఖ్యసమస్య. వాణిజ్యము మొదలగు వ్యవహారికములవలెనే రాజకీయ ధర్మములును మానవశోధితములు. రాజ్యాంగములు, రాజకీయధర్మములు, రాజ్యార్థముల ననుసరించియుండును. కనుక ప్రప్రథమమున రాజ్యాంగముల యాదర్శార్థములను స్పష్టపరచుట యవసరము. తరువాత నట్టి యాదర్శార్థముల సాధించుటకుత్తమమైన యవయవ సౌష్టవమెద్దియని విచారింపనగు. ఈ రెండుసమస్యలను విమర్శించినపిదప ప్రాజ్ఞులైనవారు పాలితులకు దమ యాదర్శప్రభావంబుల జెప్పి యొప్పించి వారిసమ్మతిని సాధింపవలయును. ఉత్తమమైన పాలనాపద్ధతులను దెలిసికొనుటయు, తమ యభిప్రాయములు హేతుసహితములని

దేశీయుల నొడంబరుచుటయును, రాజకీయ సంస్కర్తలకు విధియైయున్నది. ఇట్లు జేసినపిదప తమయాదర్శముల సాధించుటకు వలయుపట్టుదలను సాంఘికమనమునందు బురికొల్పవలయును. ఇది శాస్త్రీయమగు సంస్కరణవిధానము.

ఇందుకు వ్యతిరిక్తమగు మరియొకసిద్ధాంతము గలదు. ప్రభుత్వసాధనములు కేవలము బుద్ధిసూత్రములచే నిర్మింపబడునవి కావనియు, యంత్రములవాడినట్లు మన యిచ్చవచ్చినటులెల్ల వాటిని నియోగింప గూడదనియు, రాజకీయధర్మములు ప్రజాగర్భమునం దిమిడియుండి సమయోచితముగ నుద్భవించి ప్రబలునవియు, నవి స్వజాతమైన పరిణామధర్మముల ననుసరించి ప్రకాసించునవియును, మరికొందరు జెప్పెదరు. లోకమునందు గానవచ్చు నితరవస్తువులవలెనే మనము వాటి గుణస్వభావముల దెలిసికొని వాటిధర్మముల ననుసరించి జీవితకృత్యముల నలుపుచుండవలెననియు, నానాజాతుల సాంప్రదాయాది ప్రత్యేక గుణస్వభావములను, ఆచారములను, ఆదర్శములను, ననుసరించి వారివారి పాలనాపద్ధతులు క్రమముగా సంఘములం దవతరించి దృశ్యము లగునవియు, నీరెండవపక్షమువారు వాదింతురు. ఇందుకు విరుద్ధమైన ధర్మమార్గములం దేజాతినైనను బురికొల్పినయెడ నట్టి వికృతధర్మములను వారు చిరకాల మాచరింపరనియుగూడ వీరు నుడివెదరు. వివాదాంశములను స్పష్టముగా గ్రహించనందున నిట్టి వాదభేదము గలిగినదేగాని యీరెండుసిద్ధాంతముల యందుండు యథార్థములను బరిశీలించినయెడ వీరు నిరూపించు విరుద్ధమంతయు శబ్దభేదము మాత్రమేయని చెప్పనగు. మొదటిసిద్ధాంతము

వారు సమయావసరములను సాంఘిక సాంప్రదాయాది నిజగుణముల నిరాకరించి కేవలము బుద్ధిసూక్ష్మమునే ప్రమాణముగానమ్మి వ్యాధినెరుగక మంచిమంచి మందుపప్పులన్ని నూరిపోసి చూచు మూఢవైద్యునివలె జేయుదురను వాదము సాహసవాక్యము. రెండవపక్షమువారును పాలితులు స్వతంత్రములనెల్ల వదలి నిశ్చింతనులై పరవను గొట్టుకొనివచ్చు ప్రాణులచందమున నిశ్చేష్టితులరై మానసిక జడత్వమును బొంది యుండెదరనియును జెప్పరు.

ఇందుండు భేదమంతయు స్వపక్షాభిమానజనితమైనను కొంతవరకీభేదము వారి మనోవృత్తులందుగూడ కనుపించును. రాజ్యాంగములు ఎవరెన్ని భ్రమలు గల్పించినను కేవలము మానవకల్పితములు. అవి జనేష్టాశ్రితములై యున్నవి. ఏమనుజుడును దాను నిర్మించి లేదనంతటిలో నూతనధర్మము లంకురించి పెరిగినట్లు జూచుచుండుటలేదు. రాజ్యాంగములు వెదజల్లిన విత్తులనుండి పుట్టిపెరుగు వృక్షములను గాని, నాటినమాత్రాననె పెరిగి పంటనిచ్చు పైరులనుగాని, బోలియుండవు. పాలితుల యభిమానమును భక్తియుక్తమైన యనుష్ఠానమును నాశ్రయించి రాజ్యాంగములు దినదినము మానవ జీవితకృత్యములచే బోషింపబడి పెంపొందుచున్నయవి. రాజ్యాంగములు మనుష్యసహాయము లేకయే తమంతటదాము నడచుటలేదు. అవి మానవకల్పితములేగాక జనసామాన్యముచే నడుపబడవలయును. కనుక వారి శక్తియుక్తులను మించిన యవయవసౌష్ఠవము సార్థకము గానేరదు. ఇందుకు వలయుస్థితి త్రివిధముగానున్నది. (1) పాలితుల యనుమతిలేని పాలనాపద్ధతులు

గొనసాగవు. వాని యనుమతి లేకున్నకు వారి యయిష్ట మా పాలనపద్ధతుల బాడుకొనసీకుండునంతగా నుండగూడదు, (2) అట్టి పద్ధతులు నిల్పియుండుటకు నలయునదెల్ల జేయుట కాసంఘమువారు కృతనిశ్చయులై యుండవలయును. (3) వారి సహనమువల్లను, సాత్వికవృత్తులవల్ల నేగాక వారిశక్తిప్రభావములతో దోడ్పడగలిగినంత దృఢనిశ్చయము గలిగియుండ వలయును. ఇట్టి యనుకూలత లేని సంఘమునం దెట్టి రాజకీయ వ్యవస్థలును సార్థకములు గానేరవు. ఇట్లు సాంఘిక సాంప్రదాయాది ప్రత్యేక స్వభావముల నాశ్రయించి పాలనపద్ధతులు బ్రత్యేకింపబడు చుండును.

ఒకసంఘము చిరకాలమునుండియు నేదో యొకకుటుంబమువారిచే నేలబడుచుండును. కొన్నిసంఘములు పరాధీనమైన నేగాని రాజులపాలనమున కొప్పుకొనరు. మరికొందరు ప్రజాపాలమునం దభిమానము గలిగియుందురు. ఒకప్పుడు సంఘములు స్వపరిపాలనయం దయిష్టము లేకుండినను, దాని యం దభిమానముగూడ గలిగియుండినను, దానిని సాధించుకొనుటకుగాని, సాధించినయెడ రక్షణము జేయుటకుగాని, తగినంత యాత్మత్యాగముతో గూడియుండు పరాక్రమ వృత్తుల నవలంబింపకుండుటచే, నాదర్శములు పత్రస్థములు గాను, స్వప్నతుల్యములుగాను ఉండును. సోమరితనమువల్లను, అధైర్యమువల్లను, దమశత్రువుతోడ బోరాడనోపకయో, శత్రుకల్పితములైన భ్రమలకు వశమగుటచేతనో, ఏదో యొక యత్యుత్సాహసమయమునం దావేశవశులై తమ యధికారములనెల్ల నానాటి శూరునిపాదములకడ సమర్పించియో,

ఒకప్రాజ్ఞుని బుద్ధివిశేషతను, సుగుణసంపదలను, నమ్మి వాని కర్పించిరో, సంఘమును బలువిధముల స్వతంత్రముల గోల్పోవుచున్నవి. స్వతంత్రమున్నను, ప్రతినిధిత్వ పద్ధతుల నాచరించుచున్నను, ప్రజాసమూహములు దమపాలనయందుచితమైనంత నీతిని బురికొల్పుచున్నను, తమకుండు హక్కులను మోమోటములుగలవారికో, ధనమిచ్చువారికో, దురభిమానముల బురిగొల్పువారల కిచ్చిరో, తమహక్కులను సార్థకముగానీక పరమార్థత్యాగు లగుచున్నారు. ప్రతినిధిత్వమిట్లు దుర్నీతి జెందుటచే నీచుల యేలుబడియు, ధర్మభంగమును, బలీయములగుటయేగాక దుర్మార్గులకు సంఘము క్రమముగా వశమగును వెనుకటి దినములలో గొప్పప్రభుత్వములు చిరకాల ముండువికావు. వెంటనె రాష్ట్రములన్నియు రాజులవశమై పూర్ణస్వతంత్రముతోనో లేక సధిరాజులతో స్వల్పసంబంధముగలిగియో యుండెడివి. అధిరాజు మిక్కిలి దూరముగనుండుటచే వెంటవెంటనే వారియాజ్ఞ లనుష్ఠింపబకుండుటయు నవిధేయతను వెంటనే దండించుటకు వీలు లేకుండుటయు, దేశమంతటను దమయధికారమును వ్యాపింపజేయుటకును, వారి చట్టము లుల్లంఘితము గాకుండజేయుటకును, వలయు సైన్యముల కవసరమగునంత ధనము లేకుండుటయు, దగినంత ధనమును దెచ్చు పన్నులిచ్చుటకు ప్రజ లసమర్థులైయుండుటయు, మొదలగు కారణములకు వశమై పెద్దరాజ్యములు స్వల్పజీవితములబొందెను. ప్రభుత్వముల కాధారమగు సాంఘికావస్థలను బరిశీలించుట ముఖ్యము. రెండవ సిద్ధాంతమువారు పరిణామ ధర్మముల నాశ్రయించి చెప్పునదంతయు పైజెప్పబడిన యవస్థాత్ర

యముసం దిమిడియున్నది. దానికి మించినది వారి వాదము నందేమియు లేదు. వారి వారి యాచార ధర్మముల నాశ్రయించి ప్రభుత్వములుండునని నంతకంటె నెక్కువ యూహింపదగిన దేమియు లేదు. ఒకజాతి యొక్క సాంప్రదాయముల ననుసరించిన పాలనాపద్ధతులు వెంటనే సిద్ధిజెందగలవనుట స్పష్టము. ఇట్టి సాధనముల నుపయోగించుకొనని సంస్కర్తలుండరు. సాంప్రదాయాది గుణములు రాజ్యాంగ నిర్ణయములందెంతముఖ్యమైనను, మానవజాతులు వాటికి కేవలము బద్ధులై పోనక్కరలేదు జనసామాన్యము లు దమ యలవాటులందును అభిమానయుక్తమైన ధర్మాచరణములందును జారవతో బూనిపని జేయుదురనుట నిజమే. కాని వారు నూతనధర్మములను గూడ దెలిసికొని వాటియం దభిలాష జెందుటయు వాటి నుత్సాహముతో ననుష్ఠించుటయును, దరుచుగ జూచుచున్నాము. మనచరిత్రలందు మనమెన్న డెరుగనట్టియు, బొత్తుగా ననుభవజ్ఞానము లేకున్నను నూతనవిషయములందు జనసమూహము లాతురతతో బెక్కుప్రయత్నముల నెడతెగకుండ జేయుటజూడగా రాజకీయ ధర్మములందు బూర్వాచార బద్ధమగు టవసరము లేదు.

పాలితులు దమపాలనమార్గముల కగు నీతిశక్తులును, మనోనిశ్చయమును, గలిగియుండవలెననుట నిర్వివాదాంశము. ఒకప్పుడు ప్రజ లున్నతపాలనపద్ధతుల నపేక్షింపకున్నను వారియం దట్టి యావేశముల నురికొల్పుట ముఖ్యమైయున్నది. ఉన్నత యాదర్శములను, ఉత్తమపాలన పద్ధతులను జనులం దెడతెగక ప్రచురించుచుండుటయే గాక వాటిస్థాపన వల్ల

వారికిగల్గు సుఖసంపదలను, విషయిక లాభములను, విస్తరించి విమర్శనగా బోధించవలయును ఈవిధమున సాధారణముగా జాతులను వారిప్రాజ్ఞులు, నూతనావస్థలకు బురికొల్పుచుం దురు. ఇట్లనే ఇటాలియాదేశపు ప్రజానాయకులు గడచిన రెండుతరములనుండియు దమజాతివారిని స్వపరిపాలనమునకు సిద్ధపఱచిరి. అయినను ప్రజలను వారిశక్తులకు మించినంతటి యుద్యమములకు నీడ్వగూడదు. ఉన్నతాదర్శముల సాధించి నిర్వహించుకొనుటకు దగు శక్తియుక్తుల ప్రమాణమునెరిగి వాటినిగూడ దగునంతగా బెంపొందజేయవలయును. ఇంతకు జనవిరుద్ధమైనట్టియు వారికి ధర్మవిరుద్ధమగునట్టియు, వారియను మతిలేనట్టియు ప్రభుత్వము దీర్ఘకాల ముండజాలదు. అట్టి రాజ్యాంగము క్షణభంగురము.

ఇందుకు మరియొకయభిప్రాయము గలదు. రాజకీయోత్పాతములందు గనుపించుశక్తులు ప్రాజ్ఞుల మనోబలముల కతీతమనియు, నవి కేవలము దైవవశమనియును, మరి కొందరూహింతురు. సంఘములం దనేక తెగలవా రుందురు. బహుపక్షమువారు లఘుపక్షములను బీడింపకుండుటకు సాంఘికపక్షములందెల్ల బాలనశక్తిని సమముగా విభజించుట యవసరమని కొందరూహించెదరు. ఇందునను గొంచెము నిజము గలదు. ఎక్కువశక్తిని గలిగియుండు బహుసంఘమువా రుత్తమస్థానముల నావరించుకొనెదరు. ఇచట శక్తియననేమి? భుజబలమా? మానసపుతూనికయా? జనసంఖ్యయా? సంఖ్యాబలము, భుజబలము, ధనబలము, జ్ఞానబలము, వీటిని విమర్శించిన యెడల యథార్థము దెలియనగు. సంఖ్యాబలము, ధనబల

ము లేకున్నను ధైర్యసాహసాది నీతిగుణములు గల లఘు సంఘములే యప్పుడప్పుడు బహుసంఘములను వశపరచుకొని పాలనజేయుటను మనము జూచుచుండుట లేదా? ఇట్టి సాంఘికశక్తిభాజ్యములు దమప్రభావముల రాజ్యాంగములందు జూపట్టుటకు నంగసౌష్ఠవ మావశ్యకము. రాజ్యాంగముల వశపరచుకొనినవారు తమ యంగసౌష్ఠవమునకు వసతుల నెక్కువగాంతురు. ఇట్టి వసతులు లేవి యితరపక్షములవారు ప్రభుత్వము వారిశక్తులతో బలాబలముల పరిమాణమును జూపసాగినయెడల లఘుసంఘమువారే యెక్కువ తూగవచ్చును. రాజకీయ విషయములందు నితర విషయములందు వలెనే శక్తి మనమునందిమిడియుండును. సంఘట్టనము చే శక్తి వెలువడుచున్నది. నిశ్చయసంకల్పము లనివార్యములగు శక్తులను మేల్కొలుపును. మనోనిశ్చయమే శక్తిసాహసముల నిచ్చును. వీటి నేపక్షమువా రెక్కువగా గలిగియుందురో వారు పూర్ణజయము నొందెదరు. ఆత్మనమ్మకముగలవానిని నూఱుమందిసామాన్యులెదురొడ్డినను గెలువజాలరు సంఘములుమనోనిశ్చయము లెవరియందు ప్రబలియుండునో వారిపక్షము నే వహించును. జనులనందరిని నొకయాదర్శమున కెవరు బురికొల్పెదరో సంఘములు వారివశ మగును. పుణ్యావేశములు శక్తిసాహసముల నీయగలవు. ధర్మానుష్ఠానములందెక్కువ యభిమానము గలవారియందు మాత్రమే పుణ్యావేశములు జనింపగలవు. కనుక ధర్మమే జయమొందుచుండును. లోకమునందు విఖ్యాతిగాంచిన యున్నతమతములును, యుత్తమాదర్శములును, మొదట సూక్ష్మాంకురములతో నుదయించి

పెరిగి పెద్దవై ప్రబలుచున్నవి. చరిత్రలందు బ్రతిష్ఠగాంచిన యున్నతకృత్యములన్నియు బట్టుదలతోను, మనోబలము తోను మాత్రమే సాధింపబడినవి. భుజబలమును, ధనబలము నుమించినది మనోబలము. సంఘమునందుండు విసి థాచారము లును హేతువాదమువల్లనే సాధింపబడినవి. సంఘమువారి నందరిని హేతువాదమువల్ల నేరాజ్యాంగసౌష్టవ ముత్తమ మని నమ్మింతుమో ఆయాదర్శమును సాధించుటకు జనసం ఘములు బూనుకొనును. .కనుక జనసమ్మతమైన పాలనయే సాధ్యమగును. జనాభిప్రాయము ననుసరించియే రాజ్యాంగ ములు నిర్మింపబడుచున్నవి. జ్ఞానధికులే సంస్కర్తలు. వీరి కా త్మబుద్ధియే సుఖకరము. ప్రాజ్ఞులు సామాన్యుల సంప్రదింపరు వారిపరిజ్ఞానశక్తులచే సంఘములనూతనమార్గములకు నీడ్చెదరు.

# నాలుగవ ప్రకరణము

—oo❀oo—

## రాజ్యాంగ పరమావధి.

రాజ్యాంగములు మానవకల్పితములనియును, మానవ జాతియే సంస్కరణాధికారులనియును, బూర్వప్రకరణమున వివరింపబడెను. ఏదేశమునకైన నుత్తమరాజ్యాంగ మెద్దియో యిచ్చట నిరూపింతము. దాని వైఖరీవిలాసములెవ్వి దాని ప్రత్యేకచిహ్నము లెవ్వి యని యడుగందగు. ఇందుకుముం దుగా రాజ్యాంగములవిధుల నవలోకింతము. రాజ్యాంగము పరమార్థసాధకముగా నెంతుమే కాని దానినే పాలితుల జీవ తముయొక్క పరమావధిగా నెంచము. రాజ్యాంగము సాధక మైయున్నందున దాని విధులను దెలిసికొనినగాని దాని యా కారస్వరూప స్వభావములను నిర్మింపజాలము. ఒక దేశము యొక్క రాజ్యాంగము ఆదేశముయొక్క యాంతర్యపరివేష్టి తావస్థల ననుసరించియుండును. నాగరకతజెందిన దేశములం దుగంటె నెక్కుడభివృద్ధిజెందని దేశములందు రాజ్యాంగమున కుండు విధు లెక్కువ పరిణామభేదముల జెందియుండును. రాజ్యాంగములొసగు మేలు మితమైయున్నను వాటి యపకార ము మాత్ర మొకప్పు డమితమైయుండును. ఒకజాతివారు బొందదగిన సుఖసంపద లాజాతియొక్క సాంఘికగర్భమునందే యిమిడియుండును. రాజ్యాంగము దానికి తగినంతటి యవకా శము నీయవచ్చును. ఇవ్వకను పోవచ్చును. కాని దుర్మార్గము బెంపొందజేయుట కొకప్పుడు రాజ్యాంగమున కమిత యవ

కాశమును, సామర్థ్యమును, యున్నట్లు గనుపించును. సాంఘికసౌఖ్యాతి వృద్ధియే రాజ్యాంగము యొక్క ముఖ్య విధిగనుక సాంఘికార్థములన్నియు విచారింపబడవలయును. వీటిని వివరించినగాని వీటిని పాలించునట్టియు, వీటి యభివృద్ధి కవకాశత నిచ్చునట్టియు, రాజ్యాంగసౌష్ఠవమును స్పష్టముగా నిర్ణయింపజాలము. సాంఘికార్థములు ద్వివిధములుగానున్నవి. స్థిరత్వము అభివృద్ధి వీటియందు సాంఘికావశ్యకములన్నియు నిమిడియున్నవి. స్థిరత్వము అభివృద్ధి (order and progress) వీటి యంతరార్థమేమి? స్థిరత్వమే ముఖ్యమని చెప్పువా రభివృద్ధి చపలత్వముతో గూడి యుండుననియును అభివృద్ధియే ప్రధానమని చెప్పువారి స్థిరత్వమునందుండు నిశ్చలతవల్ల గ్రమముగా సాంఘిక జీవము జడత్వము జెంది నశించుననియును జెప్పెదరు. కాని విచారించినయెడ వీటివిరుద్ధభావము గనుపించదు. స్థిరత్వము విధేయతను గోరుచుండును. ప్రభుత్వమువారు దమయాజ్ఞల నుల్లంఘనము గానీయకుండుటకు దగుశక్తియుక్తులను గలిగియుండినయెడ నాప్రభుత్వము స్థిరముగ నున్నదని చెప్పుదురు. కాని విధేయతకు మితియున్నది. అధికారుల యాజ్ఞల నన్నిటికి లోబడియుండవలయునని నిరంకుశ ప్రభుత్వము వారు గూడ జెప్పరు. స్థిరత్వము రాజ్యాంగమునకు ముఖ్య ధర్మమనుట నిర్వివాదాంశమే గాని కేవలము స్థిరత్వము రాజ్యాంగములకు పరమావధి కానేరదు. స్థిరత్వము సాంఘికార్థములకు సాధనము మాత్రమేగాని సాంఘికార్థము గానేరదు. స్థిరత్వమనగా సంఘమునందుండు భాజ్యములకు బరస్పర దౌర్జన్యము లేకుండ శాంతిని బొందియుండుట యని జనవిదిత

ము. సంఘమునందుండువారు పరస్పరవివాదములను తగు న్యాయస్థానములవల్ల దీర్చుకొనుటయు బరస్పర విరోధములను దమ స్వశక్తులవల్ల సాధింప లేకుండుటయును, స్థిరత్వము యొక్క ముఖ్యలక్షణము. కాని న్యాయాధిపతులును, వారాచరించు రాజకీయ ధర్మములును, అధర్మము ననుష్ఠింపజేయు పద్ధతులును క్రమముదప్పినయెడ స్థిరత్వము వెంటనే సాంఘికాభివృద్ధికి భంగకరమగును. స్థిరత్వమునం దొక్క లాభము మాత్రమున్నది. స్థిరత్వము పూర్వధర్మములను సంఘమునందుండజేయును. కాని యభివృద్ధి సుఖదాయకములగు పూర్వధర్మములను భంగము జేయుననుట కేవలము సాహసవాదము. స్థిరత్వము, యభివృద్ధియు, విరుద్ధస్వభావములు గలవికావు. స్థిరత్వమున కావశ్యకమగు శక్తులనే యభివృద్ధి యెక్కువ పరిమాణములందు గోరును. సంఘమునందుండువారి మంచినడవడికయు, సిరిసపదలునుగదా ప్రతివారును కోరునది. ఇందుకు సమానము, సత్యము, న్యాయబుద్ధి, శ్రద్ధాసక్తులునుగదా ముఖ్యములు. వీనిని వెంపొందజేయుటయే గదా అభివృద్ధి? వీటికివిరుద్ధమైన యభివృద్ధి యేమిగలదు? ఈగుణములు స్థిరత్వమునందుకంటె యభివృద్ధియం దెక్కువ గావలయును. ఈగుణము లేశక్తుల వల్ల సాధింపబడినవో ఆశక్తుల విజృంభణమువల్లనే వాటిని రక్షించుకొనదగు. అభివృద్ధియందుండు ప్రత్యేకగుణములు బుద్ధిసూక్ష్మము కల్పనాశక్తి అభివృద్ధి వీటిని మిక్కిలిగా పురికొల్పును. ఇప్పుడు సాంఘికమనోవృత్తుల విచారించుట మాని, వాని బాహ్యరూపములను విచారింపుదు. స్థిరత్వమును వెంపొందజేసి యభివృద్ధిని గావింపనట్టియు, అభివృద్ధినిగావించి

స్థిరత్వమును బలపరుపనట్టియు, రాజ్యాంగసౌష్ఠవమును గురించి మే మూహింప జాలకున్నారము. ఈరెండింటిలో నొకదానిని హెచ్చుచేయునది రెంటినిగూడ విస్తరింపజేయును. దీనినొక దృష్టాంతపూర్వకముగా విచారింతము. రాజ్యాంగసౌష్టవమందు పోలీసుస్థాపనము ముఖ్యభాగమైయున్నది. ఇది సాంఘికనిలకడకొరకును, స్థిరత్వముకొరకును గదా నియమింపబడినది. నేరములదండించి స్వాత్తులను, స్వామ్యమును గాపాడినచో నభివృద్ధి కవకాశమిచ్చుచున్నది. ఇది పామరులగు జనసామాన్యము నమ్ముచుండు క్షుద్ర దర్శనమైయున్నది. సంఘముల బంధించు చట్టములచే నేరముల నణచుటకన్న నానేరములకు బురికొల్పునట్టిగాని, తోడ్పడునట్టుగాని సాంఘికమనోవృత్తుల బుట్టనీకుండు టెక్కువ యభివృద్ధిదాయకము. సంఘమునందుండువారి యాస్తిస్వాత్తులను బదిలపరచి వారికి బూర్ణమైనరక్షణ మొసగినచో వారిమనసులు నిర్భయముజెంది వారి సిరిసంపదలయందు బెంపొందదగు ప్రయత్నముల కుచిత విశ్రాంతి నిచ్చుటయేగాక ధైర్యమనోవృత్తుల కవకాశత మొసగును. తనతోడివారల నుండి దౌర్జన్యము మొదలగు నపాయములు లేవని నమ్మినచో సంఘమునందు బరస్పరానురాగము, దయ, ధర్మము విస్తరించును. ఇది క్షేమకరము. రాజ్యాంగములందు ధనార్జన వ్యయములను బాలించు యార్థిక స్థాపనములను గురించి యోచింపుడు అర్థశాస్త్రము బ్రస్తుతము సంఘమునందుండు ద్రవ్యమును, ద్రవ్యసాధనములను గాపాడుటయేగాక, వాటి నభివృద్ధిజెందజేయు మార్గములనుగూడ విచారించును. కృషులను నిరుత్సాహపరుపనటుల పన్నుల వేయుటయును, దేశవాసుల

స్వతంత్రభంగము గావింపకుండుటయును, జాతీయధనమును గాపాడుటయేగాక దానిని విస్తరింపజేయుటయును ఆశాఖావారిధర్మమైయున్నది. ఆదాయవ్యయ విషయములందు తప్పుదారుల బోయినయెడ సంఘములు దరిద్రవశమగుటయేగాకదుర్గతిపాలగును. కనుక స్థిరత్వము, అభివృద్ధి పరస్పరవిరుద్ధములగునట్టి సాంఘికావస్థలు గానేరవు. ఇవి రెండునువిరుద్ధమైన లోకదర్శనములని తలచరాదు. స్థిరత్వము అభివృద్ధియుసాంఘికసంపదల బెంపునకు ముఖ్యమగు నేకశక్తియొక్క యవస్థా భేదములేగాని వేరుగావు. ఆశక్తియే స్థిరత్వమునందుకంటె యభివృద్ధియందెక్కువ పరిమాణముల దాల్చియుండును గనుక నుత్తమరాజ్యాంగమనగా నభివృద్ధికి వలసిన యవకాశతనొసగు రాజకీయాంగసౌష్ఠవముగా నెంచవచ్చును. కేవలము స్థిరత్వము నర్థించినయెడ కాలక్రమవశమై సంఘములు క్షీణతపాలగును. సంఘమును సుషుప్త్యవస్థజెందనీకుండుట కుచితమగు బూర్వోపాయ బలముతో వేచియుండనియెడ మానవస్థాపితము లన్నియు నిష్ఫలతజెంది క్షీణించి నశించును.

మానవజీవిత కృత్యములును, యవివేకతయు, దౌష్ట్యము, సోమరితనము, ఉపేక్షయు, యివియన్నియుగలసి ప్రవాహమై తమయూరువడి బలముచే సంఘములను నిజమార్గములనుండి తప్పించి భిన్నాభిన్నముగజేయును. సంఘములిట్లు దుర్దశజెందకుండుటకు గొందరు నిజశక్తివల్లను, మరికొందరు మనోనిశ్చయములతోడను దమ ప్రజ్ఞావిశేషములచేతను, బలపరాక్రమములవల్లను, సాంఘికోద్ధారణ మొనరించుచుందురు. ఇట్లు మానవకోటి యొకప్పు డజ్ఞానాంధకారమున జిక్కి స్వశక్తుల

వెలిబరుపనపుడు మహాపురుషులు దమయమహానుభావశక్తి ప్రభావములవల్ల జాతిని మేల్కొలిపి నూతనోద్యమములకు బురికొల్పి వారి నున్నతవృత్తులం దభిలాషితులుగ జేయుచుందురు. స్థిరత్వమును అభివృద్ధియు, బరస్పర విరుద్ధములుగావని దెలిసికొనవలయును. కాని యీవాదము మనోవృత్తిభేదములవల్ల గలుగుచున్నది. కొన్నిమనములందు జాగ్రిత ప్రధానముగా నుండును. మరికొన్ని మనములందు ధైర్యము ప్రధానగుణముగానుండును. కొందరు సంస్కరణములందుకంటె సంఘముఖం దిదివరకుండు ప్రాప్తిసంపదలను మాత్రము కాపాడుకొనిన జాలుననియును, మరికొందరు దానినే సంస్కరణములచే బెంపొంద జేయవలెననియు నమ్ముచుందురు. ఇట్టి మనోవృత్తిభేదజనితమైన యావేశోద్రేకములచే సాంఘికమనము ముందు వెనుకలకు జల్లకవ్వమువలె నూపబడుటచే గలుగు మథనమువల్ల పరమార్థసిద్ధి గాంచుచుండును. కనుక సామాన్యముగా రాజ్యాంగములందు పాలనసభల నేర్పరుచునపు డీరెండుస్వభావములు నట్టిసభలందు సమకూర్చుట యభివృద్ధికరముగ నుండును. సాంఘికావశ్యకముల నన్నిటిని సమర్థింపందగు నంగసౌష్టవ మెట్లుండుననీ విచారింతము.

రాజ్యాంగముల స్వభావముల నిర్మించు నట్టికారణములును, వానిని ప్రత్యేకపరచునట్టి స్థితులును, పాలితుల గుణముల నాశ్రయించుకొనియున్నవి. సంఘమునందు సత్ప్రవర్తనము, సుశీలత, బుద్ధిసూక్ష్మము మున్నగు సుగుణములు ముఖ్యముగనుక వీటి నేరాజ్యాంగము మిక్కిలిగా బెంపొందజేయునో యదియే యుత్తమరాజ్యాంగము. ఒకజాతియం దేరా

జ్యాంగము వారి యుత్తమనీతిశక్తులను విస్తరింపజేయునో, వారి జాతీయధర్మములను బ్రకాశింపజేయునో, వారున్నతాదర్శముల వీక్షించి సాధించుట కేరాజ్యాంగము పూర్ణావకాశతను సాంఘికభాగ్యముల కన్నిటి కొసగునో అదియే వారి కుత్తమరాజ్యాంగమని స్పష్టమగుచున్నది. అట్టి రాజ్యాంగము యొక్క చిహ్నముల గొన్ని వివరింతము.

న్యాయపరిపాలన మొనర్చు రాజ్యాంగమును గురించి మాత్రము విచారించిచూతము. రాజ్యాంగమొసగు న్యాయపరిమాణము మొదట నీయంత్రమును ద్రిప్పువారి సుశీలత నాశ్రయించి యుండును. న్యాయస్థానములందుండువారి యోగ్యత అధికముగా నుండవలయును. తరువాత వీరిపనులపై విచారణచేయువారి నడవడిక క్రమముగా నుండవలయును. సంఘమునందుండు సుశీలతాప్రభావము వీరియందు బ్రతిబింబించి యుండవలెను. వీరొసగు న్యాయము సంఘము నుత్తమగతులకు బురిగొల్పవలయును. సుశీలత, బుద్ధిసూక్ష్మము, బరస్పరతనొంది యుండవలయును. ఈ రెండుగుణములును వారియందు క్రమమేళన మొందియుండవలయును. వీరు సామాన్యముగా జనాభిప్రాయముల ననుసరించి నడచుచుందురు. కనుక ప్రజాభిప్రాయము పైరెండుగుణములును క్రమమేళనము నొందియుండవలయును. ఇటుల సంఘమంతయు నుత్తమధర్మముల పాలనకు దగినంతటి నీతిశక్తులతోను మనోవికాసములతోను నిండియుండవలయును. న్యాయచట్టములును, వాటి ననుష్ఠించు పద్ధతులును సాంఘికాదర్శముల కనురూపములుగా నుండవలయును. న్యాయాధిపతుల ప్రవర్తనలను

సరిజేయుటకును జనాభిప్రాయము దానిని బరిశీలించి చూచు టకును తీర్మానములు దగినంతగా బ్రచురింప బడుచుండవల యును. సభలందును, బత్రికలందును, న్యాయాధిపతుల దౌష్ట్య ములను స్పష్టముగా వెలిబరచు చుండవలయును. ఇందుకు పాలితులందు నీతిమనోబలము లుండుటయేగాక వాటిని విస్త రించి సాధకముజేయుటకు తగినంత స్వతంత్రమున కవకాశత యుండవలయును. న్యాయస్థానములయందు సాక్ష్యము బుచ్చు కొనుమార్గము లప్పుడప్పుడు మారుచుండవలయును. న్యాయ స్థానముల కందరు రాదగినవసతు లుండవలయును. పని తొం దరలుండువారికిని, పేదలకును, కాలవ్యయము, ధనవ్యయమును లేకుండ దగునట్లుండవలయును. ఇవియన్నియు దౌష్ట్యము నణచుటకు సాధనములై యున్నవి. ఇవన్నియు నధికారాను ష్ఠాన సాధికలుమాత్రమేగాని యధికారమును జేయునవిగావు. ఈసాధికలు క్రమోపయోగకరముగ నుండని యెడల నీయం గనెష్ఠవ మంతయు నిష్ప్రయోజనమగును. న్యాయాధిపతుల ప్రజ్ఞావిశేషము లుచితపరిమాణముల నుండవలయు. వారివే తనములు యోగ్యతలకొలది పెంపొందవలయును. ఇట్లనే యితరరాజ్యాంగములు వాటివాటి విధుల నుచితముగ నెర వేర్పగలిగి యుండవలయును. వారికృత్యము లన్నియును లేఖ నపూర్వకముగను, ముద్రితములుగను, జాగ్రతగా నుంచవల యును. అధికారులు తమతమ విధులను తమభారములను దెలి సికొనుటకు దగుశాసనము లుండవలయును. వాటి యుల్లంఘన ములు, ఉపేక్షలు, లంచములు మొదలగు దుష్కృత్యముల నణచివేయుటకు దగుచట్టముల జేసియుండవలయును. అధి

కారులందరు తమస్థానికధర్మములను క్రమముగ ననుష్ఠించు టయే తమకు స్వలాభకరమగునని గట్టిగ నమ్మినయెడ నట్టి యధి కారులుపాలించు రాజ్యాంగసౌష్ఠవము త్తమ రాజ్యాంగమని చెప్పవచ్చును. అధికారసంఘమునందొక భాగస్తుడై తాను దన తోటివారి భాగలబ్ధములందు భాగియైనచో నిట్టి ధర్మమును జూపట్టును. కనుక నీ ప్రతినిధిత్వపద్ధతులందుండు సుగుణములె వ్వియనః—(1) సంఘమునందుండు సుశీలతను బుద్ధిమాత్త్వము నుచిత పరిమేళనమునందుగల సాంఘిక భారములను గార్య నిర్వాహకుల కొసంగబడును. ఇట్టి యనుకూలత మరియేయంగ సౌష్ఠవమందును గనుపించదు (2) సంఘమునందుండువారు దమజాతియొక్క మెప్పునొందుటకు దగు ప్రజ్ఞాప్రభావములకు బురికొల్పబడుదురు. ప్రజానుమతిని సాధించుటకు వారికి మేలొసంగుటయే తమ స్వలాభమగును. (3) తమ యభిప్రా యములను తమ మనోవృత్తులను బ్రచురపరచి సాంఘికమన మును తమకనురూపిగ జేయుటకును, వృత్తిభేదముగల తోడి వారలతో తూగుటకును మరియు నంగసౌష్ఠవము నియ మించుకొనవలసియుండును. ఈవిధముగా సంఘమునందు నంగసౌష్ఠవము నిర్మించు శక్తియుక్తులు ప్రజ్వరిల్లును (4) ఉత్తమన్యాయ శాసనములను, ధర్మములను, పవిత్ర తతో బాలింపదగిన న్యాయాధికారులును, న్యాయబుద్ధిగల నాగరకతమైన పాలనమును, మిక్కిలి తేలికయగు నార్థికపద్ధ తులును, విద్యాభివృద్ధికరమగు స్థాపనములును, గలిగియుండిన మానవజాతి వెంటనే తననుచితధర్మమును సాధించి లోక హితకరమగుటకు సందియము లేదు ప్రతినిధిత్వమువల్ల ప్రజా

సమూహము దమపాలన దామే చేసికొనుటకన్న మంచి యంగసౌష్ఠవముండుటరిది. అట్టి ప్రతినిధిత్వ ప్రభుత్వము లేదని సాంఘికావస్థల నారవ యాధ్యాయమునందు వివరింపబడును.



# ఐదవ ప్రకరణము

## స్వపరిపాలనము

పురాతనము నుండియు సుగుణములుగలిగి ధర్మములను చక్కగా బాలింపదగిన నిరంకుశ ప్రభువొకడుండినచో వానిచే నియమింపబడు సంగసౌష్ఠవమే యుత్తమ రాజ్యాంగమని యాదిమజాతులవారు భ్రమజెందియుండిరి. ఇది రాజ్యాంగశోధన నాపివేసి రాజకీయ శాస్త్రమునందు పౌరులమనముల జొరనీక వారి రాజకీయోత్పాతమునందు పరాక్రమవంతుల రాజ్యకాంక్షకు శీఘ్రసాధనములై సాంఘికశక్తిప్రభావముల విజృంభింపనీక బహుకాలమునుండియు వారావేశముగలవారికెల్ల దాసులై పరాక్రమశూన్యులై పరవశులై నిజధర్మత్యాగులై, అవిద్యాసాగరమున మునిగియుండిరి బహురాష్ట్రములందు జనసమూహముల దినకృత్యగమనముల నెల్ల వీక్షించుటకును, వారి పాలనాపద్ధతులనెల్ల బరిశీలించుటకును సుశీలతా శోభదాయకమగు శాసనముల నిర్మించుటకును, అధికారుల ధర్మవర్తనముల నవలోకించుటకును ధర్మత్యాగుల నెల్ల దండించుటకును, యోగ్య శిఖామణుల కధికారమొసగుటకును, న్యాయపాలకులు నీతిదప్పకుండు నియమముల నేర్పరచుటకును, వారివారి వేతనము లుచితమగునట్లు వృద్ధిజేయుటకును, జ్ఞానాభివృద్ధికగు విద్యాభవనములనెల్ల విస్తరింప జేయుటకును, సేనాసమూహములు దమ శిక్షసాధనములచే అనివార్యమగు శక్తుల సాధింపజేయుటకును, పన్నుల భారముగానీక దగు పరి

మాణములనుంచుటకును, ఆర్థికస్థాపనముల నెల్ల సూక్ష్మబుద్ధితో సమర్థించుకొనుటకును, రాజ్యాంగములందుగల యంగసౌష్ఠవముల నెల్ల సాంఘికావస్థల కనురూపులుగ జేయుటకును, ఒకకన్ను జంటయు, నొక హస్తద్వయమును సరిదూగుననుట పిచ్చినమ్మకము. రాజునకు వీటినిగురించిన వార్తావిషయములను యథార్థముగా దెలియజేయుట కుచితసాధనము లుండవలయును. వారిచే నియమింపబడు నధికారులవల్ల నంతఃపురమందున్న రాజున కన్నిసంగతులు దెలియుట యసాధ్యము. రాజులకైనను దైవమిచ్చినది దినమున కిరువదినాల్గుగంటలేకదా! వీరికాలములో వర్తమాన విషయములన్నిటికి దగినంత శ్రద్ధనొసగుట యసంభవము. సంఘమువారి నిత్యజీవితములను గురించి విమర్శనగా దెలిసికొనుటకు బాలితులందరను వారి ప్రత్యేకగుణముల నెల్ల దెలిసియుండవలెను. నిరంకుశప్రభువు సర్వావస్థదశుండగుటకు సర్వజ్ఞుండైయుండెనేని రాజ్యభారమునంతయు జక్కగా నిర్వహింపగలడు. తా జేసికొనలేని బహుకార్య విధానముల నిర్వాహకత్వమును దగిన జ్ఞానధీరుల కర్పింపవలసినదేగదా? రాజ్యాంగపాలనమొనర్చు మంత్రులకు దగు నిర్ణయములతో విధి విధానముల నెల్ల గ్రమముగా భాగింపవలయును గదా! వారి యోగ్యతలను బరిశీలించుటకు దగినసీతిశక్తులు బుద్ధిసూక్ష్మమును, రాజునకుండవలయునుగదా! ఇట్టి యనంత సామర్థ్యములు రాజునందుండునా? అట్టిరాజులు తరతరమునను దొరకుదురను నిశ్చయమెట్లు సాధ్యము? కొన్ని సాంఘికావశ్యములందు నెవరోయొకధీరునిపై రాజ్యభారము నంతయువదలివేయవలసియుండును. అమానుష మనోబలములుండినగాని సంఘము

వారితోడ్పాటు లేని దెవ్వరును వ్యవహరింపజాలరు. నిరంకుశ ప్రభుత్వమందు బాలితులు నిశ్చేష్టులై జడత్వము వహించి యుండవలయును. జాతియంతయు నధికారరాహిత్యము నొంది తమగతుల నొకనికర్పించవలయును. వారి సాంఘికపాలనమందు వారిస్వతంత్రమనోవృత్తులను బ్రవేశపెట్టజాలరు. వారిధర్మములును, వారి చట్టశాసనములును వేరొక్కని మనోవృత్తుల నాశ్రయించవలసియుండును వీని మనోవృత్తులను ఇష్టానిష్టముల నెదిరించువారు నేరస్థులగుదురు. ఇట్టి పాలనక్రిందనుండువారి మనోవ్యాపారములెట్లుండునో యూహింపదగును. వారు పాలనపద్ధతుల విచారింపబూనరు. సిద్ధాంతముల బరిశీలింపరు. ఒకవేళ బరిశీలింపబూనినను కేవల శాస్త్రీయవాదములు సహింపబడవచ్చునేమోగాని వాని ననుష్ఠానమునకు సంఘమును బురికొల్పినయెడ వారిని దగునటుల దండించి యట్టిమనోవృత్తుల నణచెదరు. జనసామాన్య మిట్టి స్వతంత్రవృత్తుల నవలంబింపరు. వారిసుఖములను గోల్పోవుట కొప్పుకొనునంతటి జ్ఞానధీరు లరుదు. యోగ్యతలు దగుప్రతిఫలముల బొందనియెడ సద్గుణములు సంఘమునందు సాధింపబడవు. ధర్మము లపాయకరమని జనులు వాటిని విడనాడెదరు. కొన్ని కుటుంబములవారో, లేక కొన్ని యుపసంఘములవారో యవసరమగునంతవరకు సామాన్యవిద్యల మాత్ర మభ్యసింతురు. రాజ్యవైభవమునకో, రాజులపాలనను బలపరచుటకో యవసరమగునంత భుజబల పరాక్రమములను, పౌరుషవృత్తులను, కొద్దిపరిమాణములతో నప్పుడప్పుడవకాశత నిత్తురు. నీతిశక్తులడగి, గిపసదనము నొందును. పాలితుల మనోసంకల్పము

లును, భావములును, ఆవేశాభిప్రాయములును గ్రమముగా క్షీణించి బుద్ధిసూక్ష్మమును జూపట్టకుందురు. సాంఘికాభిమాన చింతనమంతయు నశించును. ధర్మాభిలాష కృంగిపోవును. జాత్యభిమాన మెచ్చటను గానరాకుండును. మనోవృత్తులెల్ల ముకుళించుకొనిపోవును. స్వచింత, యాత్మకాంక్ష, స్వలాభాపేక్షయు, దినదిన ప్రవర్ధమానములగును. సాంఘికకోన్నత గ్రంథములందునో, పురాణములందునో, పత్రిస్థమై విద్వాంసుల కన్నుల కప్పుడప్పుడు దగులుచుండును. ఇట్టి దురవస్థ యాసియాఖండమునం దెల్ల జూడవచ్చును. ఇండియా చైనాదేశము లొకప్పుడు జ్ఞానోన్నతులందు నోలలాడుచుండెను. ఈదేశములం దిపుడు రాజుమాత్రమే దేశాభిమాని యని చెప్పదగును. దేశస్వాస్థ్య మంతయు సాంకేతమగుచున్నది. పూర్వాచారధర్మములు నానావికారముల దాల్చి సంఘమునం దచ్చటచ్చట మిణుకుమిణుకుమని వెలుగుచుండును. స్వాభిమాన పూరితులైన సంఘము వారి మనోవృత్తులు ముడుతలుజెంది కుటిలగుణములతో గూర్పబడి అహంకారముచే గట్టిపడి పరస్పర విరోధములందుమాత్రము నిజవికాసముల జూపుచు జీవము వ్యర్థపుచ్చుచుందురు.

ఇట్టి దురవస్థా వశమైనవారు సాంఘికార్థ సముదాయపాలనమును బరుల కొసగి తమ సాంఘికావశ్యములందు నావంతైన చింతనుంచక సంభవించునదెల్ల దైవఘటనమని నిశ్చేష్టులై గ్రహస్థితులకు గట్టువడి తనవిధికృత్యములనుగూడ బరిత్యజించి విషయసుఖముల నాశ్రయింతురు. సామాన్యసుఖముల నొందినవారు దమ మనోవృత్తులను వినోదములకును శృంగార

ములకును సమర్పింతురు. ఇట్టి సాంఘిక నిశ్చలతను జూచు పరదేశములవారును, రాజ్యకాంక్షగల పరాక్రమవంతులును, వీరిపై దండెత్తివచ్చి యోడించియో, మాయచేత నాడంబర చియో, తమప్రభుత్వముల బ్రతిష్ఠచేసికొని పాలితుల స్వగృహములందుమాత్ర ముచితమగునంతవరకు స్వతంత్రము నొసగి నిరంకుశులై పాలనజేయుచుందురు. కాని యిట్టిపాలనములు నానాటికి అరిది అగుచున్నవి. ఇదియంతయు నిరంకుశ ప్రభుత్వమువల్ల గలుగుఫలము. ఈ యవస్థలందుండి మానవజాతి తిరిగి మేల్కొనకుండుటకు ప్రభుత్వమువారు దమయధికారమును దగుశాసనములచే స్వబుద్ధివలననే మితపరచుకొని నటుల గనుపింపజేయుచు సంఘమువారిని నిద్రబుచ్చుచుందురు. సంఘమునం దొకవేళ నూతనాదర్శము లుదయించినచో, వాటి నణచివేయుటకు గొన్నియీవికహక్కుల గల్పించెదరు. సమయమువచ్చినపుడెల్ల దమ దాతృత్వమును బ్రచురపరచుచు సంఘమువారిచే మెప్పొందుచు దమయధికారుల గొనియాడి వెంటదగులు నీచప్రముఖులకు బిరుదులొసగియో, గౌరవచిహ్నముల జూపియో, సంఘమునందు రాజభక్తిని బురికొల్పుచు విద్యావంతుల నెల్ల నేదో యొకవిధమున వశపరచుకొని పాలించుచుందురు. అవస్థాభేదము జూచినవెంటనే తామిచ్చిన నూతన హక్కులను గ్రమముగా ననుష్ఠానముల నుండి తప్పించి సమయముజూచి వాటిని శాసనములనుండి తీసివేతురు. ఇట్లు శాసన ప్రతిశాసనములచే దమ ప్రతిష్ఠను గాపాడుకొనుచుందురు. రాజులు తమ యౌదార్యమువల్ల నిచ్చు హక్కులు పరరాజుల బలములచే నొసగబడిన స్వతం

త్రములును సాంఘికయోగ్యత లేనిదే నిర్వహించుకొనుట యసాధ్యము గనుక క్షణభంగురములు.

నిరంకుశప్రభువులు విద్యలను గొంతవరకు మాత్రమే యభ్యసింప నిత్తురు. అయినను ఇట్లు మితవిద్యనొందిన వారును గొన్నిసమయములయందు నూతనాదర్శముల నపేక్షింపక మానరు. కొంతవరకైనను విద్యను నభ్యసించినయెడ వారమనోవృత్తులు పూర్ణముగా నణగియుండక స్వాతంత్ర్యమును గాంక్షింపక మానరు. కనుక సంఘమునందు విచ్చలవిడిగా బాఠశాల లుంచబడవు. స్థానికపాలన కొన్ని సాంఘికావశ్యములందు కొంత కాలము మాత్రము ఒక సర్వాధికారిని నియమించుకొనుట యవసరమని చెప్పవచ్చును. సంఘమువారి నాపత్తులనుండి తప్పించి తిరిగి స్వాతంత్ర్యమునకు సమర్థులను జేయగలిగినంతటి వారుండినచో నట్టి యేర్పా టుపయుక్తమని తలపనొప్పును. అందుకు దగునంతటి యావశ్యము లేనిచో నుపద్రవములను గలుగజేయును. కనుక నిరంకుశ ప్రభుత్వము అశుభదాయకమని యెంచెదరు.

సాంఘిక సముదాయమునం దధికారము భాగింపబడియుండు టుచితమను సిద్ధాంతమును స్థాపించుట సులభము. ప్రతివారును రాజ్యాంగమును గొంతవరకు నియమింప గలిగియుండుటకు తమ గ్రామములందునో, రాష్ట్రములందునో శక్త్యనుసారముగ రాజ్యాంగములను నడుపగల యవకాశతను బొందియుండుటకు నుండు రాజ్యాంగసౌష్ఠవము స్వపరిపాలన మగును. ఇట్టి పాలనపద్ధతులు జనుల ప్రజ్ఞావిశేష

ముల నెంతవరకు వికసింపజేయునో బరిశీలించి చూతము. ప్రజాప్రభుత్వము సాంఘికావస్థలందెల్ల నుత్తమమయాదర్శమని మేము వాదించుటలేదు. కొన్ని స్థితులందుమాత్రము స్వపరిపాలన ముత్తమమనుటకు సందియము లేదు. అట్టి యంగసౌష్ఠవము వల్ల గలుగు తాత్కాలికలాభములకన్న ఉత్తరార్థము లధికముగనుండును. మనుజులందరును సమముగా నధికారయుక్తులైనచో వారివారి సొత్తులను గాపాడుకొనుట సులభమగును. ప్రతిస్పర్ధ న్యాయముచే సాంఘికయాన్నతను బలపరచుటకు నొకరికంటె మరియొకరు బ్రయత్నింపబూనుదురు. మనుజులు కీర్తికాంక్షచే ననేకకార్యముల సాధింతురుగనుక కీర్తినొసగు సమయములు సాంఘికగర్భమునందు నిమిడియుండవలయును సంఘములును వ్యక్తులును స్వయం కృషివల్లనే తమ జీవితార్థముల సాధించుకొని యుత్తమగతుల నొందుచున్నారు. ఆత్మరక్షణ మొనర్చుకొనజాలనివారి కుత్తమగతు లెట్లుగలుగును? ఎవరిసొత్తులను వారు గాపాడుకొనుటకును దమ స్వార్థముల నెరవేర్చుకొనుటకును జనులందరు దగియుందురు. స్వలాభమెరుగనివారియందు సాంఘికశక్తు లుదయింపనేరవు. తమ లాభనష్టములను తామే పాలించుకొను టతిసులభము. తమకు శక్తిలేనియెడల తమసన్నిహితులు తమపనులను నెరవేర్పబూనియుండవలయును. జనసామాన్యములు స్వార్థములందు నాతురతతో బనిచేయుదురు. అధికారమంతయు నొకకులమువారియందుండినచో వారితరకులములవారికిన్యాయ మొనగూటరుదు. మనదేశములో శూద్రాదుల నధికారస్థానములకు రానీకుండ వీలైనంతవరకు దోసివేయుచుంటిమి. ఇంగ్లాండునందు కొంత

కాలము క్రిందటివరకు కూలిపనులను జేయువారిని రాజ్యాధి కారముల నొందనీయకుండ ధనికులు బెక్కుప్రయత్నములు జేయుచువచ్చిరి. కృషిజేసికొని జీవించు పేదలను లోబరచుకొనుటకు ననేక యుపాయముల బన్నుచుండిరి. ఇట్లు కొంతకాలమువరకు వారివేతనములను వృద్ధిచేయకుండుటకు కుట్రల నెడతెగక గావించుచుండిరి. ఇందుకు శాసనములను గూడగల్పించిరి. కాని ప్రస్తుతము వారి యభిప్రాయములు మారిపోయెను. ఇప్పుడు పెట్టుబడిదారులందరు దమ లాభముల ను మితపరచుకొని పనివాండ్రకు దగు వేతనములనీవ్వ బ్రయత్నించుచున్నారు. పార్లమెంటువారుగూడ పేదల కుచితమగు నార్థికచట్టముల జేయుచున్నారుగాని పార్లమెంటువారు వారి మొరల నెన్నిమారులు నిరాకరించియుండిరి? వారి కష్టములు పార్లమెంటువారికిని, పనివాండ్రకును నొకవిధమున నెప్పుడైన గనుపించినవా? వారి కష్టములనుగురించి పట్టుదలతో సభలందు జెప్పబూనిన ప్రతినిధులను దరుచుగా వెలుపలకు ద్రోయుచుండుటలేదా? ఇందులకు బనివాండ్ర సమూహములు దరుచుగా యంత్రశాలలను బహిష్కరించుచు సాత్వికనిరోధపద్ధతులవల్ల పార్లమెంటువారు వారిమొర లాలకించునటుల నేబదివత్సరములనుండి యిప్పటివరకు దమ గతుల సాధించుకొనుటకు బోరాడుచున్నారు. ప్రజాప్రభుత్వముగల స్వతంత్ర రాజ్యములందుండువారి యార్థికస్థితులను వారి సమకాలికులగునట్టియు నిరంకుశ రాజులచే బాలింపబడినట్టియు నితర రాష్ట్రనివాసుల స్థితులతో బోల్చిచూచినచో దారతమ్యంబు జూపవచ్చును. పూర్వకాలమందు (ఆతెన్సు) మొదలగు

గ్రీకుపట్టణములు వాణిజ్య విద్యలందును, శాస్త్రపరిశీలనయందు ను, పౌరుష వృత్తులందును, అసమానశోభ గాంచెను. వారి చెంతనుండి రాజులచే బాలింపబడు పరిషియా మొదలగు పెద్ద రాజ్యములందలిజను లజ్ఞానాంధకారమున మునిగి సిరిసంపదల నెక్కువగా బొందలేక శాస్త్రవిద్యల నెరుగక మూఢులై యుండిరి. రోమనుదేశస్థులు దమ స్వరాజ్యము స్థాపించి దిక్కులనెల్ల జయించి నాటిలోకమునకు నాయకులై మిక్కిలి కీర్తి గాంచిరి. వారినాటివారందరును రాజుల వశమై హీనదశను క్షీణించుచుండిరి. స్విడ్జర్లాండు, హాలెండు, ఇంగ్లాండు దేశములవారు రాజులచే బాలింపబడు ఆస్ట్రియా, వెనుకటి ఫ్రాన్సుదేశములకంటె మిక్కిలి సౌఖ్యములనడసి ధనికులై గొప్పరాజ్యాధికారులై ప్రసిద్ధిజెందిరి. స్వపరిపాలన మిపుడు ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్విడ్జర్లాండు, అమెరికాఖండము నందు సంయుక్త రాష్ట్రములును, కనడాయును, సర్వజన సమ త్వమును బ్రతిష్ఠజేసి సకలసంపదలతో దులదూగుచున్నయవి. రష్యా మొదలగు ఇతరదేశములందు జనసామాన్యమునకు బూర్ణమైన స్వపరిపాలనము లేకున్నను రాజులు వారియభీష్ట ముల నాశ్రయించి పాలించుచుందురు. కొన్ని దేశములందు గొన్ని తెగలవారు జాతినంతయు బాలించుచుండుటవల్ల మరి కొన్ని తెగలవారి కధికారము లేకుండుటంజేసి వారి యార్థిక లాభములను గొంతవరకు గోల్పోవుచున్నారు. అధికార మూలమును గురించి కొంచెము విచారింతము. మనోవృత్తులు రెండువిధములుగ బరిణమించుచున్నవి. సాంఘిక యాన్న త్యము బరమావధియని యెంచితిమేని యీ రెండు మనోవృత్తు

లలో నేదిప్రబలియుండిన తదర్థసిద్ధియగునో విచారింపదగును. కష్టములను దిరస్కరించి బంధముల విదళించువృత్తియా? లేక సంకటముల సహించి యవస్థావశమగు వృత్తియా? సామాన్యమైన నీతిధర్మములును, జనసామాన్యము యొక్క యభిప్రాయములును, సహనము నపేక్షించుచున్నవి. సామాన్యులందరు వీరుల బూజింతురు. పరాక్రమమును బొగడెదరు. కాని సాము రత్వముచేత గష్టముల గొప్పకొనరు. సత్యవాదుల చరిత్రల జదివి సంతసింతురు ధర్మాభిమానమును బురికొల్పు పురాణ గాథలనెల్ల భక్తితో బఠనసేయవచ్చును. కాని సత్యము జెప్పటకు, ధర్మము ననుష్ఠించుటకు, నూటికొకరైన నుద్యమింపరు. సాంఘికాభివృద్ధిని గమనింపక నిరాటంకమగు మార్గములందు మాత్రమె నడచుచుందురు కాని వీరజడత్వము దమలో బుణ్యావేశులగు కొందరిని వీరవృత్తులకు బురికొల్పకమానదు. ఇట్లొకప్పు డకస్మాత్తుగా నసంతుష్టి ప్రబలి యసదృశ స్వార్థత్యాగముచే నభివృద్ధిని సాధించును. శాంతి యభివృద్ధి పరస్పరవిరుద్ధములుగావు. మనుష్యజాతి శాంతము నపేక్షించును. బుద్ధిపూర్వకముగా మార్పుల నంగీకరించదు. నూతనాభిప్రాయములను నూతనమతములను దూషించును. బుద్ధిమంతులను నూతనధర్మముల జెప్పినందుకు దండించును. హేతుసహితమైనను సుఖప్రాదుర్భావముల బరిశీలింపజాలక పూర్వధర్మముల వదలకుండును. బుద్ధిమంతుడు నూతనమార్గములందభిలాష గలిగియుండును. అనుష్ఠేయమగు ధర్మములను గష్టములనెన్నైన సహించి తనజీవితములోకి దెచ్చుకొన బ్రయత్నించును. ఇందువలన బ్రతియుగమునందును బుద్ధిమంతులకు

పామరులకు వివాదములు జరుగుచుండును. ఇట్టి సంఘర్షణమున జనించు జ్ఞానశక్తి సంఘముల నుత్తమపదవుల కీడ్చుచున్నది. అడవులు వృక్షశాఖాసంఘర్షణమువల్ల గలుగు నగ్నిచే దహనమునొందుచున్నవి. శక్తి, మనోగుణము, బుద్ధిశక్తియంత్రము. నిశ్చలత నపేక్షించు జనసామాన్యులు ధీరుల శక్తిప్రచండముల నడ్డగించ దగునంతటి పరిశ్రమనుగూడ జేయనోపరు. నిరోధ వృత్తిరహితులై ధీరపరితాపములకు దాస్యులగుచున్నారు. వీరేమైన నిరోధమును గల్పించినను శూరుల యావేశబాణముల కోర్వజాలరు. శూరులొకప్పుడు శాంతమును జూపగలరు. పౌరుషము సహనము నేకమయి ధీరులందు బ్రకాశించవచ్చును గాని సహన పక్షాభిమానులగు సామాన్యులు వీరావేశముల బూనుదురనుట యసంభవము. సహనము నిరోధము భార్యాభర్తలకు బోల్చవచ్చును.

మనుజులు నిరోధమువల్లనే జీవితార్థముల సాధించుచున్నారు. నిరోధమువలననే మనము మంచిపట్టుదలతో విద్యల నభ్యసించుచున్నారము నూతనపరిశ్రమ వృత్తులన్నియు నిరోధమును గోరుచున్నవి. ఆతురత, ఉత్సాహము, పరిశ్రమము నిరోధమునకు గుణములు. నిరోధమువల్లనే జీవితము సాధ్యమగుచున్నది. సహనము నిశ్చలత్వము గానేరదు. ప్రసవమునందు గర్భవతులు జూపు సహనము నిరోధయుక్తమగుచున్నది. సహనము, నిరోధము, నిజముగా నొకటియే. సహనము సోమరితనము గానేరదు. సహనమే దీర్ఘమైనచో నిరోధమగుచున్నది. సహనమునకును నిరోధమునకు నుండు భేదము వ్యాప్తిభేదము మాత్రమే గాని గుణభేదమేమియు

గనుపింపదు. సహనము నవలంబించిన మనసు తృప్తిజెంది కల
వరించునేమో కాని ప్రయాసచే యథార్థముల గ్రహింపజా
లదు. దృశ్యములగు స్థూలములమాత్రము విచారించును.
ఖండితవాదముల నపేక్షింపదు. స్పష్టతలేనట్టియు సాక్ష్యము
దొరకనట్టియు వట్టిభ్రమలతోను మెట్టవేదాంతములతోను వ్యర్థ
ప్రసంగములతోను బొద్దు పుచ్చుకొనుచుండును. సహనము
నీచావస్థలందు నాత్మగౌరవమును జంపివేయును. స్వయం
కృషి నశించును జీవము దైవఘటనముల వశమై సోమరితనము
నాశ్రయించి కృశించును. చెల్లియుండియు సైరణ సేయవల
యును. ఆత్మగౌరవము, స్వయంకృషి లేక కాలము వేచియుండు
సోమరులగు వారు దమలో నవశాత్తుగా నెవరికైన సంపద గలి
గెనేని కష్టార్జితముగాని సిరులజూచి ఈర్ష్య దిట్టమగును ఒకరి
నొకరు చూచి యోర్వలేక దౌష్ట్యముల పాలగుదురు. వన
సంఘమునందుండు సంతుష్టి నిరాశవలన గలుగుచున్నది. జను
లకు విషయాదులందు నాసక్తి లేకుండుట లేదు. భారతసంతా
నమెప్పుడు నింతటి వస్తుకాంక్షను గలిగియుండలేదు. వస్తు
ప్రాప్తి మననాటివలె నింత యరుదెన్నడును గలిగినట్లు విన
కుంటిమి. ఇంగ్లండు, అమెరికా, జపానుదేశముల గరిమమం
తయు బరిశ్రమమువల్లనే కలిగియున్నది. ఒకపు డజ్ఞానమువల్ల
సంతుష్టి గలుగవచ్చును. ప్రజ్ఞావిశేషముల బొంది సాధ్యా
సాధ్యముల దెలిసికొనిన వారికుండు సంతుష్టి నిజమైనసంతుష్టి.
ఉత్తమయాదర్శముల దెలిసికొనుటయును వాటిని సాధింప
బూనుటయు, వాటిని సాధింపదగు సాధనవిధానముల దెలిసి
కొనుటయు, నందుకగు నాత్మత్యాగముల జేయుటయు, స్వా

భావికము. విద్యలు పరిశ్రమసారము. నీతి నిరోధలబ్ధము శాంతిచలనము లభివృద్ధియందు మేళనమగుచున్నయవి. నావకు చుక్కాని తెరచాపయు గదలికను నిలకడను గ్రమపరచుచున్నట్లుల, సహనము, నిరోధము మానవజాతిని మంచిగతులకు నీడ్చుచున్నవి. జడత్వముకంటె చలనముమంచిది. అశక్తతకంటె వ్యర్థపరుపబడు శక్తియైన మంచిది. చింతనయుక్తమగు మానసము నిర్జీవముకన్న శ్రేష్ఠము.

నిరంకుశప్రభువులు పాలితుల యెడకువను బలపరచుచుందురు. తమ కపాయకరము గానంతవరకు స్వాతంత్ర్యముల కవకాశత నిత్తురు స్వాతంత్ర్యము, స్వచింతనము, స్వప్రేరణము, నిరోధస్ఫూర్తికి లక్షణములు ప్రభువులు వీటిని ప్రబలనీకుందురు. వారు పాలితుల జీవితభారము నంతయు వహించినట్లు గనుపించుచు, జనులు చేయదగిన దేమియు లేదని భ్రమింపజేసి పాలితుల నిద్రపుచ్చెదరు. స్వపరిపాలనము స్వశక్తులకు బూర్ణావకాశత నొసగును. స్వరాజ్యము స్వచింతనమును వెలుబరచును. పాలితులందరు సంగమించి సమముగా నధికారకర్తలగుటయే స్వపరిపాలనము. జనులందరుగలసి తమకభివృద్ధికరమని తోచుచట్టములను జేసికొనుటయు, దమకిష్టముగాని శాసనముల మార్చుకొన గలిగియుండుటయు, బాలనచట్టముల గాలానుగుణ్యముగ దిద్దుకొనగలిగి యుండుటయు, నార్థికపాలనమును గ్రమపరచుటయు, స్వరాజ్యలక్షణములు. ఇట్టి పాలనము సర్వశుభముల నిచ్చునని చరిత్రపూర్వకముగను, పరజాతుల శక్తివ్యాప్తుల జూచుటవలనను, దెలిసికొనుచున్నారము. ఇట్టి మహోద్యమములు జ్ఞానధీరులచే బ్రతిష్ఠింపబడును. సంస్కర్త

లుచిత విద్యాశక్తులం గలిగియుండవలయును. నేను సంఘము నందు బూజ్యుడను కాదుగదా యని చింతించువారు సంస్కరణముల దలపెట్టగూడదు సంస్కర్తలు దమ ప్రజ్ఞావిశేషముల చేతను, సుశీలత చేతను, సాంఘికాభిమానమును, పాలితుల పలుకుబడియును సాధించుకొనవలయును. సంస్కర్తలు జాతీయసాంప్రదాయముల జక్కగ బరిశీలించి తెలిసికొనవలయును తన యుద్యమము వెంటనే సార్థకమగు నుపాయముల నవలోకించవలయును సంస్కర్త జాతివారియభిమానవిద్యలందు విద్వాంసుడును, సాంఘికధర్మములందు ప్రాజ్ఞుండును, వారి యాచారానుష్ఠానములందు భక్తిపరుడునుగా నుండు టుచితము. ఇట్టి జనాకర్షణశక్తులచే బ్రజానాయకత్వము నొంది సంకల్పసిద్ధులగుచున్నారు. విద్వాంసులను దన ప్రజ్ఞా ప్రభావముల చేతను పామరులను ధర్మాభిమానము చేతను వశపరచుకొనదగును. జనసామాన్యు లావేశవశులు. సంస్కర్తలు దా ముద్యమించు సంస్కరణములు జనులందరి శక్తియుక్తులను రాణింపజేయ గలిగియుండవలయును. అనురాగమువల్ల భక్తి కలుగును. గుణానురూపమువల్ల ననురాగము గలుగును. పాలితులందరు సమానాధికారులయి పాలనధర్మములందు వారి గుణములన్నియు బ్రతిబింబించియుండి చట్టశాసనానుష్ఠానము వారి యభిమానముల నాశ్రయించి యుండినచో నా రాజ్యాంగము సార్థకమగుచున్నది. కార్యావసరముల సమర్థించుకొనుటకు పాలితులందరు నేకకాలమందొక్క స్థలమునకు జేరు టసంభవము గనుక వారందరి సందేశము న్యాయము

లచే నియమింపబడు స్థానికస్వరాజ్య సంఘములచేతను స్వపరిపాలనముగల ఇతరసంస్థలచేతను ఉచితమగు రాజ్యాంగములను సభలను గల్పింపనగును.

—o—

# ఆ ర వ ప్ర క ర ణ ము



## ప్ర మా ణ ము లు.

రాజ్యాంగము లాయాదేశములస్థితిగతుల ననుసరించి యుండునని ముందుజెప్పియుంటిమి. రాజ్యాంగములు మానవ స్థాపనము లన్నిటివలెనే యనుభవనిర్ణయములు. రాజ్యాంగము లకు ముఖ్యమైనది ప్రజాభిమానము జనరంజకముకాని రాజ్య ము నిమిషమైన నిలువజాలదు. రాజ్యాంగ మెట్టిదైనను బాలి తులందరు దాని నామోదింపవలయును. ఆమోదించుటయే గాక దానినిలుకడను గాపాడవలయును. రాజకీయావశ్యకము లందెల్ల బాలితులు దోడ్పడుచుండవలయును. రాజ్యాంగ విధులను సమర్థించుట కుచిత శక్తియుక్తులు బాలితులందుండ వలయును. వారిశక్తికిమించిన యంగసౌష్టవము సార్థకముగా నేరదు. అట్టి రాజ్యాంగమును రక్షించుకొనుటకు దగినత్యా గములనుకూడ జేయవలయును. కష్టముల కొప్పుకొనకున్న నా రాజ్యము నిర్వహింపబడదు.

ధర్మబుద్ధిగల విజాతిప్రభువులు గాని దేశీయరాజులు గాని తమజనులకు బ్రతినిధిత్వపాలన మివ్వబూనినయెడ సా మాన్యముగా బాలితు లాపాలనాపద్ధతుల నాతురతతో నందు కొనియెదరు. అట్టిపాలన సిద్ధించినపు డుపేక్ష చేయరు. కొం దరు వాటి నాపేక్షతో నందుకొనకున్నను జనసామాన్యములు వెంటనే దానిఫలితముల గ్రహింపకమానరు. కొందరు రాజ కీయ సంస్కరణముల నపేక్షింపకున్నను బ్రతినిధిత్వ పాలనము

కడ్డుపరచునంతటి యసూయతను జూపరు. రాజ్యపాలనమునకు విధేయత ప్రాణము. విధేయత లేనట్టియు నడకువ కలవాటుపడ నట్టియు నాదిమజాతులం దీపాలనాపద్ధతు లుత్తమమని చెప్పజా లము. కాని కొంతనాగరకత జెందినజాతులు సహనముగలిగి తమపాలనయొక్క యనుష్ఠానములందు దోడ్పడగలిగియుం దురు. మరియు వారిమనోభావములు రాజ్యాంగ ప్రేరణము లవల్లను నూతనావశ్యకములవల్లను వెంటనే మార్పు జెంద వచ్చును.

స్వతంత్రాభిమానము లేని జాతులు మననాడు మిక్కిలి యరుదు. వారియధికారములే వారి యభిమానముల మేల్కొ లుపును. వారికార్యభారమే వారియందు జురుకుదనమును బుట్టించును. ప్రతిదేశమందును న్యాయాధికారులు జనులతో నెక్కువ స్పర్శగలిగియుందురు. కనుక వీరు పాలితులం దాత్మ గౌరవమును బ్రతిష్ఠాభిలాషను గలుగజేయఁగలయును. ఇది కొలదికాలములోనే సిద్ధించును. స్వపరిపాలనమున కాత్మగౌ రవము ముఖ్యము. పాలితులు దమహక్కులను గోలుపో కుండ జాగ్రతతో వేచియుండవలయును. తమహక్కులం దభి మానములేకున్నచో వారిలో మిక్కిలి పలుకుబడిగలవా రొక రుచిత పుణ్యశక్తుల నమర్చుకొని తనకడ్డమువచ్చువారి నోడిం చియో, మాయచే నాడంబరచియో, దేశమును స్వాధీన పరచుకొని రాజగును. జనులు తమయధికార స్వామ్యమును గురుతెరుగ కుండినపుడు తమయభిప్రాయముల నణచుకొని నియోగ్యులో, వారితరపున దిరుగువారో, పురికొల్పిననేగాని వారిసందేశముల నిచ్చి తమహక్కులను సార్థకము జేసికొనరు.

వీరైనచో దమయధికారముల నమ్మి వేతురు. సందేశములను మోమోటము గలవారి కెవరికైన సమర్పింతురు. తవ్వ్యయముచే సాధింపబడిన యధికారములు విత్తార్జనకొరకే వినియోగింపబడును. అధికారము వచ్చిననాటనుండియు వారి యనుగ్రహముల నమ్మజూపుదురు. న్యాయముగూడ సమయోచితముగ దగువెలకీయబడును. నీతిశూన్యు లధికారులయినచో న్యాయము నశించును. న్యాయాభిమానములేని సంఘములందు నిశ్చయము, క్షేమము నిలువజాలవు. ఇవిలేనిదే సంఘములు నభివృద్ధిజెందజాలవు. న్యాయాభిమానము, నీతిస్థైర్యము, ఆత్మత్యాగము, ఆత్మగౌరవము స్వపరిపాలనమునకు బ్రాణాధారములు. ప్రజాభిప్రాయము దురాభిమానములతో గలియకుండవలయును. అంతఃకలహములను దగుపరిమాణములలో నుంచుకొనవలయును. కక్షలను స్వాభిమానమును మించిన దేశాభిమాన ముండవలయును.

స్వార్థములకంటె సాంఘికార్థముల నెక్కువగా నెంచుచుండవలయును. పరమార్థముల మనమునందుంచుకొని తమ శక్త్యానుసారముగ బరిశీలించుచు యోగ్యతను ముఖ్యముగా నెంచి నియోజ్యుల (Representatives) నియమించుచుండవలయును.

నాగరకతజెందని సంఘములందు సమష్టిజీవము నెరుగకుందురు. శూరులు వారిచ్చవచ్చినట్లు వర్తింతురు. జనులందరు బలమే పరమధర్మమని నమ్ముచుందురు. వారొకరికొకరు తోడ్పడుట నెఱుగరు. వారు సంఘముగాగూడి యన్యోన్యాను

బంధనములచే గట్టుపడియుండరు. అడవులందును గొండలందును భుజబలములచే సాధ్యమగునటుల జీవించుచుందురు. వారికి స్వపరిపాలనము నియోగధర్మములు ననవసరము గనుక వారికి ప్రితినిధిత్వ మన్వయముగాదు వారు బలముచే నడకువకు వత్తురు. వారిని విజాతులు బీడించినగాని పరస్పరత గలుగనేరదు. వారు దమనిత్యజీవనమున కవసరమగు భోజ్యములనుమాత్రిము మితముగా నుంచుకొందురు. కొంతనాగరకత నొందినగాని భోజ్యములను నిలువచేయరు. భావికావశ్యముల గమనింపజాలరు. వారు విశాలమగు నిండ్లనుగట్టుకొనరు. గుడిసెలలో నివసించుచు వస్తుప్రాప్తిని గురించి మిక్కిలిగా జింతింపరు. వస్తుకాంక్షచే నైకమత్యము సంఘీభావము గలుగుచున్నవి. సంఘీభావము మిక్కిలిగా వ్యాపించినగాని ప్రితినిధిత్వము నెరుగజాలరు. తురుష్కులు వారిభుజబలములచేతను గ్రూరావేశములచేతను దేశములను జయించి రాజ్యముల స్థాపించిరి. వీరందరు నేకమతాభిమానులగుటచే సంఘీభావము సిద్ధించెను. వారిమతాభిమానము నవలంబించిన పరసంఘములు సంఘీభావమును నాగరకతను దెలిసికొనెను. సమాన మమిత్రమైన సంఘములందు స్వపరిపాలనము సిద్ధింపదు. ఆత్మశిక్షలను గతివృత్తు ను సమయానుసారముగ నవలంబింపనివారు బరవశులగుచుందురు. ఒకప్పుడు గ్రామములందును రాష్ట్రములందును రాజులుందురు. ఈచిన్నరాజు లందరిపై, నధిరాజుండును. ఈ సందర్భములందు మండలములందుండు పాలితులందరికి వ్యవహారాంతములందు చక్రవర్తియొక్క అధికారము గనుపించును. స్థానికప్రిభువులు చేయుచుండు దౌష్ట్య

ములకు నధికా౽ జుపశమనము గావించుచుండును. ఇట్లొకప్పుడు జనులందరు రాజునం దభిమానము గలిగియుందురు. జనులిటుల రాష్ట్రాంతరమునుండి న్యాయమును బడయుచుందురు. ఇటు లొకపుడు బాలితుల దృష్టిపథము దూరము వ్యాపించును. వారిమనోవృత్తు లిట్లు వికసించును. ఇట్లు గ్రామాభిమానము మండలాభిమానముగను, కుటుంబాభిమానము సంఘాభిమానముగను మారి పోవుచుండును. పలు రాష్ట్రము లందుండు వారందరు దమ జీవితావశ్యము లితరరాష్ట్రములవారి బాగోగులతో గలిసియుండినటుల గ్రహింతురు. ఈ విధముగా మహామండలమం దుండు జనులందరియం దొక విధమైన భ్రాతృభావ ముదయించును. ఇట్లనేక మండలములును, సంఘములును, బరస్పరానుబంధమై యుండుటం జేసి ప్రాజ్ఞులగు వారు వివిధశాసనములను వివిధ సాంఘికధర్మములను బరిశీలింప బూనుదురు. సముదాయచింతనము బాలితులం దీవిధమున నంకురించవచ్చును.

రాజులమండలము లన్నియు బాలింపబడుటకు బహుప్రజ్ఞావంతు లనేకు లుండవలయును. రాజ్యావశ్యకముల జక్కగ సమర్థింపగలవారు రాజకీయ ధర్మములందు గొప్ప యనుభవముల సాధించుచుందురు. వ్యక్తుల యనుభవములు జాతులందు బ్రసరించుచుండును. రాజకీయరహస్యము లిట్లు బయలు పడుచుండును. ఇట్టి గూఢమర్మములు బయలుపడకుండుటకు దమ బంధువులకే యుద్యోగముల నిచ్చుచుందురు. ఒకపుడు కొన్ని కుటుంబములందు బారంపర్యమగు నధికార

విశేషముచే బహుప్రజ్ఞలు బ్రతిష్ఠితంబగుచున్నవి. అట్టి యవకాశతను బహుజను లొందజాలరు.

నిరంకుశప్రభువుల యాలోచన లిట్లుండును. మండలాధిపతులు దిరుగబాటు చేయకుండుటకును వారు స్వతంత్రము నవలంబింప కుండుటకును రాజులు జనాభిప్రాయముల నాశ్రయింతురు. మండలాధిపతులందును, పాలితసంఘములందును బ్రతిస్పర్థల బురకొలుపుదురు. ఇట్టి సమయములందు మండలాధిపతుల యధికారములు మితముగుటయు, రాజుల తీర్మానములు బ్రబలముగుటయు గలుగును. ప్రజానాయకులవల్లను, గూఢచారులవల్లను, దేశస్థితులను, జనాభిప్రాయములను దెలిసికొనుచుందురు కీర్తికాంక్ష మనుజులకు నైజగుణము న్యాయాభిమానము వల్లను ధర్మపాలనమువల్లను రాజులొకప్పుడు కీర్తిగాంచెదరు జనులందరు వీరిని బొగడుట జూచి వారి తరములవారును జనానుగుణ్యముగ నుందురు. ఇటులొకప్పుడు కీర్తికాంక్షచే న్యాయధర్మములు ప్రబలి వ్యాపింపవచ్చును. జనవాక్యమే కర్తవ్యమని జనులందరు నూహింతురు. ప్రజానుమతిని ధర్మముగా నెంచనేర్తురు. ప్రజాసౌఖ్యమునే రాజ్యాంగ పరమార్థములని తెలిసికొందురు. ఇట్లు క్రమముగా రాజుల యధికారములు మితమగుటయు గలదు దేశీయుల సంపదలే రాజులకు ముఖ్యమగును. జను లాత్మగౌరవమును బొందుదురు. సంఘీభావము నాత్మగౌరవముగల పాలితులు దమ కనుకూలము గానట్టి రాజుల నెదిరించుటయు, వారిని భంగపుచ్చుటయు, దమ యభిమానధర్మముల నిలుపుకొనుటయును గలుగుచుండును. ప్రజాశక్తు లిట్లొకప్పుడు

తెల్పఁబడును. లేక రాజుల సుశీలతవల్ల జనులందఱు మైమఱచి నిద్రించవచ్చును. రాజులు పితృభావము దాల్చిన యెడ జాతీయశక్తు లుదయింపవు. నీతి ప్రేరణము లంతరించును.

ఇంతేల రాజ్యాంగశోధన రాష్ట్రములందు వ్యాపింపక స్వలాభము నపేక్షించునట్టియు, గ్రామ వివాదములలో మునిగియుండువారికి స్వపరిపాలన ముత్తమ రాజ్యాంగము గానేరదు. నిరంకుశప్రభుత్వమైనను వీరికి మేలుజేయునని నమ్ముటకు వీలులేదు. దురభిమానులకును నీతిశూన్యులకును, దురాచార దాస్యులకును, అవిద్యాంధులకును, మూఢులకును, మూర్ఖులకును, స్వపాలన ముత్తమయాదర్శమని చెప్పజాలము. ఇట్టి సంఘమునం దుత్తమశూరులై పుట్టి జనవశ్యముచే రాజ్యముల స్థాపింతురనుట కల్ల. వీరియందు గార్యభారమును బూనదగువా రుండఁజేరరు. వీరు విదేశీయుల వశమగుచుందురు. ఇందువలననే వేయివత్సరములనుండి మనదేశమందు దేశీయసంస్థానములు వ్యాపింపకుండెను. ఇందువలననే మన మితరులవశమయితిమి. నాగరకులమైనను అధికారమునం దతికాంక్షచే సకలవైకల్యములను గల్పించుచుంటిమి. సర్వసమత నంతకంతకు మఱచుచుంటిమి. నానాటికి కక్షలు విస్తరించుచు వచ్చెను. దురభిమానములచే నానాకృత్రిమములకును కుట్రలకును సాహసించి చెడితిమి. పరధనములందును పరస్వములందును మన కాంక్ష దినదినము బెరుగుచుండెను. అందరి నణగద్రొక్కి పాలింపదగు నిరంకుశప్రభుత్వము మన కావశ్యక మాయెను. వేతనాభిమానమును అధికారకాంక్షయును విడనాడి పరమార్థముల దెలిసికొని ఆత్మత్యాగముల జేయనేర్చి, ధర్మాభిమానము గలిగి

స్వార్థముల మరచినగాని స్వపరిపాలన మను పరమార్థమును గాంచజాలము. పరతంత్రవశమగువారికి నీతిప్రేరణ లుండ జాలవు. వివశులకు వేదాంతము తత్వశాస్త్రములు, వ్యర్థములు. స్వార్థపరులకు సర్వస్వము కల్ల. జ్ఞానశూన్యులను బరమార్థము లంటజాలవు. సమయోచితమే వివేకమనియు సహనమే నీతిసారమనియు, నిహసుఖములే పరమార్థములనియు, దలచి తమపైవారికి దాస్యమొసగుచు దమక్రిందివారిని పీడించి వారి సారమునుబీల్చి వారిని బిప్పిచేయుటయే. జీవితాదర్శముగ నెంచువారికి దేశాభిమానము వినోదము. వీరి లిపిజ్ఞత్వము విద్య గానేరదు. శబ్దవిద్య జ్ఞానధీకుల జేయజాలదు.



# ఏడవ ప్రకరణము

## ప్రతినిధి సంఘముల విధులు.

ప్రతినిధిపాలన యనగా నొకదేశమందుండు వారందరు దమ యభిప్రాయానుసారముగ సమ్మకమును గలిగించు నడవడికగలవారి నెన్నుకొని వారిచే బాలింపబడుట. వారినడవడి తమకు విరుద్ధముగా నున్నపుడు వారిని తొలగించి వారికి బదులు మరియొకరి నంపుకొనగలిగియుండుట. అధికారమూలము సాంఘికగర్భమునందిమిడియుండును. దీనికి ముఖ్యగుణములు నాల్గు. (1) తమపన్నుల దామే విధించుకొనుట; (2) తమయాదాయముల దమ కవసరమని తోచువిధముల వ్యయపెట్ట గలిగియుండుట, (3) పరరాజులతో దమకుండు సంబంధములను దమకు లాభకరముగ నిచ్చవచ్చినటుల నియమింపగలిగి యుండుట, (4) సైన్యాధిపత్యమును దమ కిష్టమువచ్చినవారి కొసగి వారి పరిమాణములను శిక్షలను విధులను నిర్ణయింపగలిగి యుండుట.

సంఘమునందుండువారందరు సమముగా నధికారకర్తలయి యుండు టుచితము. ఇంగ్లాండునందధికారము మూడువిధముల వియోగింపబడుచున్నది. శాసనములమాత్రమే జూచినయెడ రాజు నిరంకుశప్రభు వనదగును. ఆదాయవ్యయముల నిర్ణయించుటందు సామాన్య జనసంఘమునకు బూర్ణాధికారము గలదు. ఇట్లనే మరికొన్ని విషయములందు ప్రభుసంఘము (House of Lords) మిక్కిలి యధికారమును గలిగియున్నది.

ఈమూడంగము లేకకాలమందు నిజాధికారముల జూపబూనినచో రాజ్యపాలనమంతయు నాపివేయవలసివచ్చును. ఆచారమునుబట్టి చూడగా సామాన్యజనసంఘమువారు (House of Commons) ముఖ్యాధికారులని చెప్పదగును. జనవాక్యము ననుసరించి నడచుచుండుటచే రాజుల యధికారము క్రమముగా మితమగుచున్నది. ఇట్లుండుటచే నేపక్షమువారు నుద్రేకములను బోజాలరు.

రాజ్యభారమును వహించు వివిధాంగముల నిధులను వివరించుట యవసరము. ప్రతినిధులకు రాజ్యాంగములపై నుండుయధికారమును స్పష్టముగా దెలిసికొనవలయును. ప్రతినిధులచే మాత్రమే నియమింపబడవలసిన విషయము లెవ్వియో వివరింతము. అధికారమూలము దేశీయులందియుండియు న్నను వారి నియోజ్యులందది సాంకేతికమగుచున్నది కొన్ని విషయములు సంఘములచే నిర్ణయింపబడజాలవు. పౌరులందరు నిచ్చుపన్నుల పరిమాణము నియోజ్యులచే నిర్ణయింపబడవలయును. ఆదాయవ్యయముల మితపరచుటకును, శాసనములచే బన్నుల మార్చుటకును, వీరు న్యాయమైన యధికారులు. కట్టడములు మొదలగు పనుల యవసరముల విచారించునధికారము ఉద్యోగస్థులందుండవలయును. వీరు తమమతములను నమూనాలతో సభయెదుట నుంచెదరు. వారి నమూనాల నంగీకరించి వలయుధనమును వీలగునటుల నియమించెదరు. నమూనాలలో దెలియబరచినవిధమున నాపనులను సాగించవచ్చును. పాలనాపద్ధతుల విషయమై భిన్నాభిప్రాయములు దేశమునందుండినయెడ నియోజ్యులుమాత్రమే తద్వి

షయముల దీర్మానింపగలరు. సభలందే పాలనధర్మములు చర్చింపబడవలయును సభలం దనేకు లుందురు. వీరివృత్తులు వివిధములుగా నుండును. వీరియనేకత్వముచే సలహాల నిచ్చుటకు దగిలియుందురు.

ప్రతివిషయమును వీరు సవిస్తరముగా దెలిసికొనజాలరు. రాజ్యాంగముల నేలుచుండు మంత్రులు ప్రత్యయ ప్రజ్ఞావంతులు. ప్రతిపాలనాంగము (departments) నొకనిక్రింద నుండవలయును. ఆయంగమునందుండు నుద్యోగులు వానికి విధేయులుగాను ఉత్తరవాదులుగాను నుండవలయును. ఇట్లు రాజ్యకార్యనిర్వాహకము గొందరుమంత్రులందు విభజింపబడుచున్నది. ఈ మంత్రివర్గముపైన ప్రతినిధులు బూర్ణాధికారులయి వారిపాలన విధానములను జర్చించుచు వారికి సలహాలను నిచ్చుచుమంత్రులను వారిక్రింది యధికారులను దౌష్ట్యములకు దండింపగలరు. అధికారులందరు జనాభిప్రాయము ననుసరించి నడచుచుండవలయును. అధికారులు జనవిరుద్ధముగ ప్రవర్తించుచున్నయెడ వారి నడవడిని పత్రికల పూర్వకముగను స్థానికసంఘముల పూర్వకముగను వెల్లడిచేయుచుందురు. ఈ విధముననే నియోజ్యులు (ప్రతినిధులు) జనాభిప్రాయముల దెలిసికొనియెదరు. నియోజ్యుల వశమైయున్న మంత్రుల కార్యక్రమమునకు దగుసలహా నిచ్చుచు పైజూచుచుండు నియోజ్యసభవారు స్వల్పవిషయము లన్నిటియందు జోక్యము గలుగజేసికొను టుచితముగాదు. అంగాధిపతులు మిక్కిలి ప్రజ్ఞావంతులయినను దమ క్రిందియుద్యోగస్థులు గొప్పయనుభవములు గలవారుగనుక వారి మతముల దెలిసికొనుచు వానిని

విమర్శించి చూచినపిదప దమకు దోచినట్టుల దీర్మానముల జేయుచుందురు. అంగాధిపతి తప్పుత్రోవలద్రొక్కి తనకు దోచు మార్పులనెల్ల జేయుచుండినయెడ వాటివల్ల గలుగుకీడు విస్తరించి దేశమంతటను వ్యాపించి గొప్ప పరిమాణముల దాల్చిన గాని జనసామాన్యములతో స్పర్శలేనట్టి తన మార్పులవల్ల సంక్రమించు నష్టములను వెంటనే జూడజాలడు. కనుక పాలనాంగాధిపతులు దమక్రింది యధికారుల యభిమతముల ద్రోసివేయుటకు సమయాసమయముల బరిశీలించుకొనుచుందురు. ఇట్లనే ప్రతినిధిసంఘమువారును మంత్రుల విన్నపముల నిరాకరించుటకు దగు కారణములుండవలయు నందురు. నియోజ్యులలో గొందరు స్వార్థాభిమానమువల్లను, కక్షలవల్లను, దమకిష్టులందుగల పక్షపాతమునను, దోడి నియోజ్యుల నమ్మించి వారందరు దమపక్షము నవలంబించునట్టుల జేయుచుందురు. వారు గల్పించు వాదముల యథార్థములు స్పష్టముగా దెలియునంతవరకు నియోజ్యులు దోడివారి మాటలను సత్యముగా నెంచి వెంటనే యుద్యోగస్థులమీదకు దండెత్తజూడదు. నియోజ్యు లెంత మంచివారైనను స్వార్థులుండక మానవు. ఈ స్పర్థావైరములచే నిజము వెంటనే బయలుపడక తప్పదు. నియోజ్యులందరు నుభయపక్షములవారు జెప్పినదంతయు సవిస్తరముగా వినుచుండవలయును. కొన్ని సమయములందు నియోజ్యులు రాష్ట్రాంతర్భాగముల కేగి సత్యాసత్యముల విపులముగా దెలిసికొనుచుందురు. అంగాధికారుల నియమించుటకు ప్రతినిధులందు నానాప్రజ్ఞ లుండవలయును. మంత్రిలందరిని నియోజ్యులు నియమించునట్టి హక్కు యుండినచో

వారు దానిని నిర్వహింపజాలరు. ముఖ్యమంత్రిని మాత్రము నియోజ్యులందరు గలిసి నియమించినచో వివిధాంగముల విధి విధానముల బాలింపదగు మంత్రులను ముఖ్యమంత్రి నియమించుకొనును. ఇది కార్యనిర్వాహకములందు మంచిపద్ధతిగా నున్నది. మంత్రులందరు ననురాగముగలిగి పరస్పర విరోధములు లేనివారయినచో కార్యానుకూలముగనుక ప్రథమమంత్రి తనకు దోడ్పడి గౌరవముతో గార్యభారమును బూనదగిన సమర్థకస్తుల నెన్నుకొనుట మంచిదియని చెప్పెదరు. కాని సామాన్యముగా నియోజ్యుల యభిప్రాయ బాహుళ్యము ననుసరించి ప్రథమమంత్రి నియమింపబడుచుండుటచే నాయన నియమించుమంత్రిగణము నియోజ్యుల కనుగుణ్యముగా నుండును. ఇంగ్లాండు దేశమందు జనవాక్యము ననుసరించి మంత్రివర్గము ను ముఖ్యమంత్రి నియమించుకొనును. ఆయన తనతో బనిచేయుటకు దగువారిని గొందరి నెన్నుకొని మంత్రిత్వ మొసగును. కొన్ని దేశములందు మంత్రివర్గము నంతయు జను లెన్నుకొనుచున్నారు. ఇందువలన నొకయాపద కలదు. జనబాహుళ్యము నాధారముగా జేసికొని మంత్రులు దమప్రతిపక్షులను దమయధికారబలముచే బాధింపబూనుదురు. ఇట్టి దురవస్థలను బాలితులు వేచియుండి సమర్థించుకొనుచుండవలయును. నియోజ్యులందరుగూడి ముఖ్యముగా శాసనముల జేయుచుందురు.

నియోజ్యులకు చట్టనిర్మాణము ముఖ్యవిధి. ఇట్టిచట్టనిర్మాణసంఘమునం దుండువారందరు సాధ్యమించు సంస్కరణముల జక్కగ శోధింపగలిగియుండు టగుదు. సంస్కరణముల నపేక్షించు సాంఘికావశ్యములను విమర్శనగా నందరు దెలిసి

కొనజాలరు. కనుక సామాన్యముగా నట్టి సమయములందు నియోజ్యులు కొందరొక యుపసభ గావించి నూతనచట్టముల గూర్చుకొందురు. ఇట్టి యుపసభలందు సుప్రసిద్ధులగు ప్రజ్ఞావంతు లుండెదరు. వీరు చట్టముల యాకారరూపములను నియమించి తమలో దాము వాదవిమర్శనము గావించుకొని పర్యవసానమును చట్టరూపమున నియోజ్యులందరు గూడియుండు మహా సభామధ్యమున నుంచెదరు. అప్పుడు ప్రతినిధిసంఘము వారు దమయుక్తిశక్తుల కొలది వారివాదములను, వారివాక్యప్రకరణములను బరిశీలించి చూచి తగుదిద్దుబాట్లను నియోజ్యులామోదించునటుల జేసి చట్టమును నిర్మాణము జేయుదురు. ఇట్టి యుపసంఘమందుండువారి సంఖ్య మంత్రిగణమునకు మించియుండదు. ఇంగ్లాండునందు బూర్ణమగు ప్రజా ప్రభుత్వము లేనందున ప్రతినిధిసంఘమువారును (House of Commons) ప్రభుసంఘమువారును (House of Lords) గూడ సమ్మతించినగాని చట్టములు నిర్ణయింపబడవు. ప్రతినిధిసంఘమగు సామాన్య జనసంఘమువారు (Commons) నిర్ణయించిన చట్టములను ప్రభుసంఘమువా రంగీకరింప కుండుటయును గలదు.

ప్రతినిధి సంఘములకు ముఖ్యవిధి జనానురాగమును గాపాడుటయే. పాలనాపద్ధతుల గ్రమపరచుటయు, నాలోచన పూర్వకముగను ప్రకటనలవలనను వారి సౌఖ్యాభివృద్ధిని వేచియుండుటయు, వీరి కార్యాంతరములు ఆదాయవ్యయముల నిర్ణయించుటకు వీరికి సర్వాధికారము లున్నవి. ఇట్లు పాలితులందరు క్షేమమును రక్షణమును బొందెదరు. నియోజ్యులు

వారి సభయందు జేయుపనులను వివరముగా బ్రచురించు చుండవలయును. ఇందువలన జాతివారందరు దమ నియో జ్యుల కార్య నిర్వాహకముల దెలిసికొనుచుండవలయును. నియోజ్యులందరు దమ నెన్నుకొనిన నియోగుల యభిమతము లను దమచేత నగునంత స్పష్టముగా బట్టుదలతో సభయందు బ్రకటించు చుండవలయును. అట్లు చేయక సోమరితనమునవో, మోమోటమువలననో, స్వార్థచింతనముననో, నిజవిధుల నిరాకరించు నియోజ్యులను వారి స్థానములనుండి తొలిగించి మరియొకని దిరిగి నియోగించవలయును. ప్రజల కిష్టార్థసిద్ధి గావించుటయే ప్రతినిధుల విధియైయున్నది. నియోజ్యులు దమ ప్రజ్ఞాప్రభావముల బ్రకటించుకొనుటకు వ్యర్థమగు వాగాడంబరముతో కాలము వ్యర్థపుత్తురను నింద నొకపుడు వినుచుందుము. కార్యావసరమునకు మించిన వాగ్బాహుళ్యము వ్యర్థము. వారు ప్రస్తుతాంశములను గురించి మాత్రమే వాద విమర్శనము సలుపుచుండవలయును. తమ నియామకుల యవ సరములను బ్రకటించుట వారి కుత్తమధర్మము. అంగాధి పతుల నడవడికను విచారించుచుందురు. రాష్ట్రములందుండు అధికారుల దౌష్ట్యములను దండించుచుందురు. అంగాధిపతు లు దమక్రిందివారి దౌష్ట్యములకు దగుదండన మొసగునట్లు రాజ్యాంగశోధనము జేయబడును. ఇట్లు న్యాయబుద్ధిచేతను, నిపుణత్వముచేతను, జనులు స్వపరిపాలనము గావించుకొను చుందురు. రెండు మూడు రాజ్యాంగములు (departments) నొకరియం దుంచకూడదు. అధికారాంధతనొందిన బహుపక్షము వారు (Majority) లఘుపక్షమువారిని (minority) బాధింప

గూడదు. ప్రజాగర్భమునం దెడతెగక నీతిశక్తుల బుట్టించు కొనుచు నిష్టార్థముల సాధింపదగు ప్రతినిధిసంఘములు కేవలము పాలనచేయవుగాని పాలనజేయు రాజ్యాంగమును నియమించును. వారి నడవడిని బరిశీలించుచు నుచితపాలనము జరుగునట్టుల వేచియుండును. నియోజ్యు లప్పుడప్పుడు మారుచుందురు నియోజ్యులు ప్రతిహస్తుల (substitutes) నంపుకొనజాలరు. నియోజ్యులకు వేతనము లుండవు.



# ఎనిమిదవ ప్రకరణము

## ప్రతిపక్షము.

రాజ్యాంగ మెట్టిదైనను గొప్పసుఖములనీయఁగును. రాజ్యాంగమును బాలించువారియందు శుభప్రదాయకవగు నవకాశత సంకేతమగుచున్నది. పరిపూర్ణమగు న్యాయాభిమానముగల నిరంకుశరా జుండినచో సుఖముల బడయవచ్చును. కాని మనకాలమందట్టిరాజులు దొరకుటదుర్లభము వస్తుకాంక్ష స్పర్థావైరములు మిక్కిలిగా బెరిగి సంఘములందసమానత్వము వ్యాపించినపుడు సంక్షోభవించి సవక్షిప్రయత్నములచే బరులనుబీడించియో మాయజేసియో సమాధానపరచియో సంఘమునకంతకు వస్తుప్రాప్తి మిక్కిలిగాగలుగు నవకాశత నొసగుటకు గొన్ని రాజకీయావస్థలందు స్వపరిపాలన మవసరమగుచున్నదని వ్రాసియుంటిమి. ఆదిమ సంఘములందు (aboriginal tribes) సర్వసమానముగా జీవితసుఖములు బొందబడుచుండును ధనములును, వాటిని సాధించుమార్గములును వివిధములయి జనులందరు శక్తివిశేషములందనేకతెగలుగ నుండుటయు వృత్తిభేదములు విపరీతముగా వ్యాపించుటచేతను నాగరక సంఘములందు దిట్టమైనట్టియవి భేదముల బెంచనీకుండ నట్టి రాజకీయావశ్యకములు గలుగుచుండుటచే ప్రజాప్రభుత్వ మవసర మగుచున్నది.

రాజ్యాంగ మెట్టిదైనను బూర్వోపాయముల నెన్నియున్నను మానవస్థాపనములందు నసంతుష్టికరమగు కారణము

లుగలుగుచునే యుండును. రాజ్యాంగమువల్ల గలుగు నాప దలు ముఖ్యముగా రెండుకారణములవల్ల సంప్రాప్తమగు చున్నవి. నానావిధులను సవరించుకొనుగాంత్రులకు (అంగాధి పతులు) దగునంతటి యధికారము నీకుండుటచేతను, జనులు విద్యాశక్తులచే రాజ్యాంగము నేలువారికి దోడ్పడకుండుట చేతను, రాజ్యాంగములు విశేషఫలముల నిచ్చుచుండుట లేదు. పౌరధర్మముల నెరుగని పామరులందు సంఘీభావము బలము గానుండదు. సంఘీభావము గుర్తెరుగనివారియందు బరస్పరత తక్కువగానుండును. అడవువను ఆత్మశిక్షలను పరిశ్రామిక వృత్తులను గుర్తెరుగరు. వారందరు స్వేచ్ఛాపక్షులు. వారికి చట్టములతో నవసరములేదు. వారి వివాదములన్నియు భుజ బలముచే నిర్ణయింపబడుచుండును. వారియందు న్యాయ స్థానములు (Courts) గానరావు. ఇట్టివారికి మాత్రము స్వపరి పాలన మనావశ్యకమని వెనుకజెప్పి యుంటిమి. నాగరకత నొంది ఆత్మత్యాగము నెరిగిన వారికి స్వరాజ్యమే యుత్తమ రాజ్యాంగము. ప్రతినిధిసంఘమువారు వ్యవహరించు కాలమం దు సర్వాధికారులుగ నుండవలయును. వారియధికార ముచి తపరిమాణమున మంత్రులందు నియోగింపవలయును. అంగా ధిపతులకు దగు నధికారమునీయని కొన్ని స్వతంత్రరాష్ట్రము లందు ప్రతినిధసంఘమువారు దమకిష్టముగాని మంత్రుల దప్పించు నధికారము లేకుండుటచే కార్యనిర్వాహక ముచిత ముగా నుండుటలేదు. మంత్రులను దొలగించు నధికారము ప్రతినిధిసంఘమువారి కుండినచో దమ మంత్రులకు వలయు నధికారముల నిచ్చుటకు సంశయముండదు. మంత్రులు

వారియధికారములను దుర్వినియోగము జేసినచో వెంటనే తొలగించివేయవచ్చును ఒకప్పుడు మంత్రులకు ధారాళముగా నధికారముల నిచ్చెను ప్రతినిధిసభవారు ప్రతివిషయములోను జోక్యము గలుగజేసికొనుచుందురు.

స్వపరిపాలనమందు మరియొక విశేషముగలదు. పాలనాధారము జనులందే యుండుటవలన పాలితుల నీతిశక్తియుక్తమగు తోడ్పాటుండినగాని రాజ్యాంగము సార్థకము గానేరదు. నిరంకుశప్రభువుల పాలనను గురించి చెప్పినపుడు పాలితుల నీతిశక్తులను ప్రజ్ఞాప్రభావములను మేల్కొలుపనందున గలుగునష్టములను వర్ణించియుంటిమి. ఈగుణములు స్వపరిపాలనకు ముఖ్యము. జనులందరు రాజ్యాధికారమును గలిగియుందురు. రాజ్యాంగమునేలు శక్తియుక్తులు బలువురందుండవలయును. జనసామాన్యములు వీలైనంతవరకు రాజ్యభారమును మోయుటకు విద్యాబలములు పాలనమునందు బనిసేయుటకుత్సాహము నుండవలయును. న్యాయమార్గములును పాలనపద్ధతులను వారికి స్పష్టముగా దెలిసియుండవలయును. ప్రాజ్ఞతత్యాగము ప్రజలయందు విస్తరించియుండవలయును.

స్వపరిపాలనమునందు సంభవింపదగిన మూడవయపాయము హ్రస్వదృష్టి. దీనివలన రాజ్యాంగమునకు చపలత్వము వాటిల్లును. ఇందువలన స్వరాజ్యమందుస్థిమితము లేదనికొందరు చెప్పెదరు. ఇదినిజమయినమాట కాదు. నిరంకుశప్రభుత్వమందు నధికారస్థానము మారుచుండదు. కొన్ని కుటుంబములవారు మాత్రమే పాలనభారమును వహింతురు. ప్రభుపాలనము

లందు నధికారులు దమ జీవితకాలమంతయు నియమింపబడు చుందురు. ఒకప్పుడు పాలనాధికారము గొన్ని కుటుంబములందు బారంపర్యముగా నిలిచియుండును. రాజ్యపాలనానుభవము కొద్దిమందియందు మాత్రమే వ్యాపించు చున్నది. రాజు తనపదవిని నిల్పుకొనుటకనేక మాయోపాయముల నెడతెగక పన్నుచుండును. ఇట్టి మానసికపరిశ్రమచే రాజులం దసమానప్రజ్ఞలు గనుపించును. నాగరకతలేనిప్రజల నేలుచుండుటచే దమయున్నతప్రజ్ఞలవల్ల నధికారమునంతయు స్థిరపరచుకొనుచుండును. కార్యభారమంతయు మంత్రులందును రాజులందును మాత్రముండును. స్వతంత్రప్రజ్ఞలుండినగాని తోటి రాజులతో సరిదూగుటకు వీలులేదు. శక్తిసౌష్టవమును అస్త్రశస్త్రప్రయోగములను జక్కగ దెలిసికొనుచుండును. రాజ్యములు శాశ్వతమగు శాంతినిబడయని జనులందరు నడకువగలిగి రాజుకు వశమయి శత్రుభయము లేకున్న రాజులు స్వశక్తులను వృద్ధిచేయరు. నాగరకదేశముల రాజులందు రాజచిహ్నములుదప్ప స్వశక్తిప్రభావములు మిక్కిలిగానుండవు మన దేశమునం దీమధ్య నియోగిబ్రాహ్మణులు మాత్రమే యధికారముల వహించుచుండుటవల్ల వారియం దసమానమగు యుక్తిశక్తులు విస్తరించినవి. లౌక్యవృత్తులనాశ్రయించిననియోగులకును వైదికులకును నుండు భేదము జదువరులూహింపగలరు. చైనా జపాను దేశములందు నుద్యోగములను బారంపర్యముగా గొన్నికుటుంబములకు మాత్రమే యిచ్చుచుండిరి. ఇట్లు కొన్నికుటుంబములవారో కొన్ని కులములవారో. రాజ్యాంగముల నేలుచుండినయెడ సంఘమునందు సుగుణసాంప్రదాయ

ములు వ్యాపింపనేరవు పరిశ్రమమున కవకాశతలేని దీలోకమం దేగుణములును బ్రబలముగా నేరవు.

స్వపరిపాలనమునందు నానాజాతులవారి నిజగుణముల కవకాశతనిచ్చి గుణాభిరామము గావింపగలదు. సంఘములందు విద్యాలయములను స్థాపించి విద్యాశక్తుల విజృంభింపజేసిన గాని స్వరాజ్యములు నిలువజాలవు జనులందరు దమశక్తిసామర్థ్యముల రాజకీయ కార్యనిర్వాహకములందు బ్రవేశపెట్టవలయును. స్వరాజ్యములకు సాంఘికశక్తి ప్రాణాధారము.

చట్టనిర్మాణసమయములందును, అధికారుల నడవడిని శోధించుటకును వారి దౌష్ట్యములను దండించుటకును బాలనాపద్ధతుల బ్రకటించుటకును నియోజ్యులకు బూర్ణాధికార ముండవలయును నియోజ్యుల నెన్నుకొనుటకు జనులకు దగినంత స్వతంత్రమున కవకాశత నీయవలయును. స్వరాజ్యములందు పౌరులందరియందును రాచేటికము సంకేతమగుచున్నది. పాలితులందరియందు రాజభూయము సహజావముగా వెలుగుచుండవలయును. పాలితు లనేక తెగలవారుగా నుందురు. వారిలోననేక మతములుందును మతములచేతను భాషలచేతను వారికిభేదములు గలుగుచుండును. వీరియందు స్వజనాభిమాన ముండవచ్చును. వీరిలో నేదోయొక తెగవారు బహుసంఘము (మెజారిటి) గావచ్చును. ఈ బహుసంఘము లఘుసంఘములపై దౌర్జన్యము జేయవచ్చును. వారి యభిప్రాయముల నిరాకరించి కీడుచేయవచ్చును. అపక్షము (మైనారిటి) వారికృషులపై నెక్కువపన్నులు వేయవచ్చును. లేక వారి పరి

శ్రమలందు బహుసంఘమువారు దోఁపఁడక పోవచ్చును. ప్రతి దేశములోను బహుమంది పేదలుగనుందురు. కొద్దిమంది మాత్రము ధనికులుగనుందురు. ఇట్టి సాంఘికావస్థలచే గలుగుచుండు పక్షపాతమును స్వాభిమానము నణచుకొనునంతటి నీతిశక్తులుండనియెడ స్వరాజ్యములు నిలువజాలవు. లఘుసంఘములవారందరు నేకీభవించి బహుసంఘమును భంగపరుపవచ్చును. లేక పరరాజుల మైత్రిచేతనో మాయోపాయములచేతనో బహుసంఘము నోడింతురు. ఇటు లౌకప్పుడు సంఘమంతయు బరవశము గావచ్చును.

కాలమొక్కరీతిగ నుండదు. పరిశ్రామిక వృత్తులు ప్రబలముగావచ్చును. యంత్రములు కర్మాగారములును దేశమంతట వ్యాపింపవచ్చును. చేతిపనులు నశించవచ్చును. పెట్టుబడిదారులు మంచిలాభముల నొందవచ్చును. కూలివాండ్ర వేతనములు క్రమముగా నుండకపోవచ్చును. ధనాధికులు కృషిస్వాములగుదురు. కూలివాండ్రకును ధనికులకును వివాదములుండగలవు. కూలివాండ్రందరు నేకీభవించి ధనికులను బీడింపవచ్చును. ధనికులందరు నేకీభవించి కూలివాండ్ర వేతనముల బెంపు చేయకుండుటకు నిశ్చయించుకొనవచ్చును. ఇట్టివైరము లౌకప్పుడు విస్తరించును. ఇట్టి యాంతర్యావస్థల సమర్థించుకొనుటకును వస్తుకాంతను వస్తుప్రాప్తిని క్రమపరచుకొనుటకు నుచితమగు దూరదృష్టియు బూర్వోపాయములను గలిగియుండవలయును. ఇట్టి క్షుద్రవైరములు సామాన్యముగా నజ్ఞానముచే గలుగుచున్నవి.

కృషిస్వామ్యములు: కర్మకరులు (కూలివాండ్రు) పరిశ్రమలకు పడుగపేకవలె వర్తింతురు. నేతకానిపడుగు పేకలం దొక్కపోగు బోయినను అతుకుదప్పదు ఏపోగు చెడినను వలువంతయు వికారము నొందును. పరిశ్రమల పరిణామముల దెలిసికొనిన కర్మశాస్త్రజ్ఞులకు నిట్టి దురభిప్రాయములును క్షుద్రవైరములును గనుపింపవు. పరిశ్రమలందు ధనికులకు మంచిలాభములు రాకున్నయెడ వారికి పరిశ్రమలం దభిమానముండదు. కర్మాగారములును వాణిజ్యములును వ్యాపింపనొప్పవు. వేతనములు క్రమముగా నుండనిచోట కర్మకరులు దొఱకు టరుదగును. ఇటుల ధనికులు కర్మకరులుగూడ నిరుత్సాహము జెందగూడదు. లాభాపేక్షలకు దగు ప్రతిఫలము లుండనియెడ బహుజనులు సంక్షోభవించి మూలధనముల నొసగరు. ధనికులు ముందుకుగానిచో గర్మకరులెట్లుజీవింతురు? ఇట్టి పరస్పరభేదము లన్నియు నహంకారముచేతను స్వలాభముయొక్క నిజప్రవృత్తుల దెలియకుండుటవలనను గలుగుచున్నయవి. యంత్రశాలలు కర్మాగారములు ధనికులకు జెందియున్నవి. బహుసంఘము నిరుపేదలు ఇటులొకప్పుడు ధనాధిపతుల పరిశ్రమములపై నెక్కుడుపన్నుల విధించినచో సరకులుమిక్కిలి విలువగలవగును ప్రియవస్తువుల నెవరుకొందురు? ఇతరదేశములవారి సరకులతో దమసరకులనుగూడ పోటీమీద నమ్మకొనవలయును. బజారుధరలకు గిట్టుబాటులేనియెడ ధనాధిపతులు లాభములేనిపనుల నాపివేతురు. వారివ్యాపారముల నాపివేసినయెడ బహుసంఘము వారగు పేదలు జీవనాధారముల గోల్పోదురు. ధనాధిపతులకు లాభమువచ్చినకొలది వారిసద్

ష్యములను వ్యాపారములందుం చెదరు. వ్యాపారము వృద్ధిబొందినకొలది జనులకు కృషిపోరకును. సంఘమునందు ధనము హెచ్చును. స్పర్ధావిశేషములచే సరకులు చౌకగును. వస్తువులు ధరలుక్రుంగినచో సుఖములనెక్కువగా గాంచవచ్చును. మనదేశమందు జేయబడు వస్త్రములు వెనుక నింగ్లాండునందు జేయబడు వాటికన్న తక్కువధరగలిగి యుండెడివి. మననేతకాండ్రతో సరితూగు టశక్యమనితలచి వారు పన్నులనెక్కువగా జేసి. మనవస్తువుల నాదేశమునకు బోనీయకుండజేసిరి కంపెనీవారు. మన దేశీయుల వృత్తుల జంపుచుండ మనమందరమూరకుంటిమి. కులాభిమానమేగాని మనయందప్పుడు దేశాభిమానము లేదు. జాత్యాభిమానము లేదు. ఇట్లు కులములవారలందన్యోన్యత లేకుండుటంజేసి జాతీయవృత్తులన్నియు నశించుటకు వీలుగలిగెను. కులములందు బరస్పరత లేకుండుటచే నిన్ని యిక్కట్టుల బడవలసి వచ్చుచున్నది. వ్యక్తుల బాగోగులు సంఘములతోను సంఘముల బాగోగులు జాతులతోను మేళనమగుచున్నవి. మనసంఘమందు జ్ఞానము విప్రులవశమైయుండెను. విప్రులు తమ యాధిక్యతను రక్షించుకొనుటకు నితరకులములవారిని యవిద్యాంధకారమున వదలివేసిరి. తమవిద్యల బరిశీలించి తమను గౌరవించువారు లేకుండుటచేత నిరాధారులయిరి. ప్రతికులమువారును స్వలాభముల నపేక్షించుటచే దేశీయులందరు దాని ఫలితముల ననుభవింపవలసి వచ్చినది. ఇటుకలను బెంకులను జేయు కుమ్మరులపై బన్నువేసినచో కలపవర్తకులుగూడ నష్టపడవలసివచ్చును. ఇటుకలు బెంకులు ప్రియమైనయెడ కట్టడములు తగ్గిపోవును. కట్టడములు తగ్గి

పోయినచో కూలివాండ్రకును బనివాండ్రకును జీవనము లుండవు. ఇండ్లు విలువ పెరిగినకొలది ఇండ్లపన్నులు పెరిగిన కొలది ఇండ్ల యద్దెలు కూడా పెరుగుచుండును. ఇటుల సంఘమునం దొకతెగవారి యాపద లితరతెగవారిని పీడించుచుండును. పొగతోటలపన్నులను చుట్టలు కాల్చువా రిచ్చుచున్నారు. ఇట్టి సాంఘికాను బంధముల నెరిగినవారు కులకక్షల నవలంబింపరు. ఆర్థికవిషయములను బరిశీలించినచో నిట్టి హ్రస్వదృష్టి నివారణము కాలదు. సామాన్యముగా జనము స్వలాభ మనుకొనునదంతయు స్వహత్యగా బరిణమించుచున్నది. నిజమైన స్వలాభము మనశరీరములను మన కుటుంబములను మించి వ్యాపించియున్నది. తన కుటుంబమంతయు సౌఖ్యము బొందియున్నగాని యేమనుజుడును సుఖముగా నుండజాలడు. గ్రామములో నెచ్చట వ్యాధులుండినను గ్రామస్థుల కందరికి నపాయకరమే. ఏగ్రామములో నయిన వ్యాధులుండినచో వారితో రాకపోకలుగల దగ్గర గ్రామముల కన్నిటికి నపాయకరమే. ఒకదేశమున క్షామము విస్తరించినచో నిరుగుపొరుగు దేశములందెల్ల వస్తువులు ప్రియమగును. ధరలు హెచ్చినయెడల నిరుపేదలు దుర్నీతి కొడిగట్ట నుద్యమింతురు. సంఘమంతయు గష్టముల పాలగును. కొందరు దమకు వెంటనే లాభకరమగు విద్యల నభ్యసింతురు. శాస్త్రములు, భాషలు, చరిత్రములు, జ్ఞానదర్శనములు విద్యావిశేషములు భాషయందున్నవి. మానవజాతియొక్క యవస్థలన్నియు బ్రాజ్ఞులు దెలిసికొనినదంతయు శూరులు జేసినదంతయు చరిత్రలందు సంకేతమగుచున్నది. శిల్పవిద్యాలయముల నా

శ్రయించినటుల మానవశక్తులు విద్యలనాశ్రయించుచుండును. విద్యలవ్యాపింపజేసినచో చింతనము వికసించును. విద్యల ప్రయోజనములనింద్రియములనడిగి తెలిసికొనజాలము మనుజుండు వ్యక్తివంతుడు. మానవకోటికి వివిధావస్థలం దేదేది యభివృద్ధికరమో, ఏదేదిన్యాయమో, ఏదిసత్యమో, ఏదిధర్మమో, అది జయమొందును. దానినే మానవకోటి యవలంబింతురు. దేశాభివృద్ధికివాణిజ్యవిరివి యాదిభౌతికము. వాణిజ్యాభివృద్ధికివిద్యా విస్తృతత ముఖ్యము. జ్ఞానసారమే నాగరకత. జ్ఞాన విస్తరతకు భాషాపరిశ్రమము ముఖ్యసాధనము. సమస్తవిద్యల కాలవాలమగుదేశము యశోన్నతల సాధించును. స్వరాజ్యములకు ననేకార్థికస్వార్థికవిపత్తులు కలుగుచున్నను దినదిన ప్రవర్ధమానమగు దేశభక్తి, ధర్మాభిమానము, సంఘీభావము, విశ్వమానవ సహోదరత్వము, దూరదృష్టి, పూర్వోపాయము, యథార్థదర్శనము, ఆత్మత్యాగమును సంగమించుటచే గలుగు ననివార్యమైన సంఘశక్తి ప్రవాహమున కడ్డుపడ గలదేదియు లేదు. మనుజుల విద్యచే జట్టుకొనబడి యున్నారు. సర్వజ్ఞుండే సర్వావస్థదతుండు. శక్తిపరిశ్రమసారము సమయములు బరిశ్రమములకాధారము. సమయములు విపత్సంపదలతో గూడుకొనియున్నవి. రాజ్యాంగము లెంత మంచివైనను తాత్కాలికముల కతీతమగుటలేదు. మన యాపదలే మనశక్తులను మేల్కొలుపుచున్నవి. మనయాపదలే మన నీతి ప్రేరణములు విపత్పరంపరలు మనజాగ్రతను మన పూర్వోపాయములను గల్పించుచున్నవి. అవి మనల నిరంతరయుద్యమములందు బ్రతిష్ఠించుచున్నవి. మన యవస్థాభేదములే మనలను నిశ్చలతనుండి లేపుచున్నవి.

వాటిచేతనే లోకమెప్పుడును సారవంతముగను, అభిరుచికరముగను గనుపించుచున్నది. లోకములు చలనముచే రక్షింపబడుచున్నవి.



# తొమ్మిదవ ప్రకరణము.

ప్రజాపాలనమునందు గలుగు భంగపాటులకు సామాన్యముగా రెండుకారణము లుండవచ్చునని వెనుక సూచించితిమి. ప్రతినిధులుగాని వారినెన్నుకొను జనసామాన్యముగాని, విద్యావిహీనులరై తమ రాజ్యవిధివిధానముల నెఱుగకుండినను పక్షపాతము వహించి లఘుసంఘములవారి కిక్కట్టుల గల్పించు చట్టశాసనముల జేయబూనినను వారిపాలన ప్రభాసిత పదవిని బొందజాలరనుట స్పష్టము.

ఇట్టి ప్రమాదములను దగునంతవరకు సమర్థింపదగిన యుత్తమస్వరాజ్యాంగ నియమములను గురించి మనము సవిస్తరముగా నాలోచింపవలయును. పలుతెగలు గలిగిన రాజకీయ సంఘమందు నేపక్షమువారయినను బహుసంఖ్యాకమై యితరతెగలవారు స్వల్పసంఖ్యగలవారయిన యెడ బహుసంఘము వారి యధికారమును మితపఱుపదగు చట్టములుండుట మంచిది. స్వరాజ్యమనగా రాజ్యాధికారము వ్యాపించు దేశమందుండు వారందరు సర్వసమముగా నధికార పూరితులగుట లేక పాలితులందరు నొకసమయమున నేకస్థలమున గలయుట యసంభవము గనుక వారు ప్రతినిధుల నంపుకొని వారిచే బరిపాలింపబడుట స్వపరిపాలనావశ్యకము. సాధారణముగా నేదో యొక బహుసంఘమువారు తోడివారగు లఘుసంఘముల నేలునట్లు గనిపించును ఇట్టిసమయములందు లఘుసంఘములవారు దమకుండు యధికారబీజముల మొలకెత్తకుండ

బహుసంఘముచే నోడింపబడుదురని తలచెదరు. బహుసంఘమువారు లఘుసంఘమువారిని వశపరచుకొనెదరనుట కేవలము మూఢవాదము. ప్రజాబలము సంఖ్య ననుసరించి యుండునని సామాన్యులందరు దలచెదరు. ఇట్లు బహుసంఘము వారు దమకిచ్చవచ్చినటుల జేయుట కధికారముగలదనియు లఘుసంఘమువా రధికారము గలిగియున్నను వ్యర్థమనియు నట్టిస్థితిలో వారికాయధికారము లేకున్నను ఉన్నను, మిక్కిలి వ్యత్యాసము లేదనియు, బావరులందురు. ఇట్టు బహుసంఘమువారి ప్రతినిధు లెక్కువమంది యగుటచేత లఘుసంఘము వారి ప్రతినిధు లెప్పుడును బరాభవమొందెదరట. ఇట్టి ప్రతినిధిసంఘమందు గూడ దమకు నేమించు చట్టశాసనములను గురించి పరిశీలించుటలో బహుసంఘమువారి ప్రతినిధులందరు నేకపక్షమువహింతురని చెప్పవీలులేదు. ప్రతినిధులందరు గూడి తమ యభిప్రాయములను వెలిబుచ్చినపిదప వారి సముదాయసమ్మతమును బొందునపుడు సంఖ్యాబలముచే జట్టములు నియమింపబడును. నూరుమంది ప్రతినిధులుగల సభయందు నేబది యొకరు జయమొందుటయు తక్కిన నలువదితొమ్మండ్రు ప్రతినిధు లోడుటయును గలదు. ఇట్లు సంఘమునందుండువా రధికార ప్రదాతలయినను వారియభిమతముల బడయకుందురని యు నీపక్షమువారు వాదింతురు. ఇందువల్ల నియోజ్యసభలచే నియమింపబడు న్యాయము క్రమముగాదనియు వారూహింతురు.

ఇట్టి వికటవాదమునకును తగు జవాబుగలదు. రాష్ట్రములన్నిటియందు నేకాభిప్రాయముండుటరుదు. ఒకరాష్ట్రము

వారు దలచునట్లు మరియొక రాష్ట్రీయులు వారు దలచరు. ఒక మండలమందు ప్రబలముగానుండు జనాభిప్రాయము మరియొకమండలమందు నంగీకరింపబడు టకుదు. ఇట్టుల ననేక మతములుగల నియోజ్యులచే నిండియుండు ప్రతినిధిసభలందు త్యుత్సాహుల యాదేశోద్రేకములను పక్షపాతముగలవారి దౌష్ట్యములను సముదాయ చింతనము సమపరచుచుండును. మనుష్యబలము సంఖ్య ననుసరించియుండదు. సామాన్యజనులు స్వతంత్రులుగారు. వారి మనములు స్వకీయతంత్రములతో వెలుగుచుండవు. ప్రబలమనస్కులు వీరిని వెంటనే వశపరచుకొని యెదరు. మనుజులు వ్యక్తివంతులు. వారునీతిశక్తులకులోబడెదరు. వారేవిషయములందును గట్టిపట్టుదల గలిగియుండరు. వారినడవడిక యంతయు ననురోధమును జూపట్టును. వారిని మనోబలముచే బురికొల్పినయెడ వారనువర్తనులై ప్రబలమనస్కులను దోడ్పడుదురు. రైలుబండ్లలో గూర్చనిపోవు పాంథులవలె మానవకోటి సుఖములను వినోదములను జూచుచు మైమరచియుండును. ప్రబలమనస్కులు యంత్రములవలెవారి నీడ్చుచుందురు. లోకము మనోమయమైయున్నది. జనవశ్యమునకు మనోబలము ప్రధానము. ప్రజాగర్భమందు నీతిశక్తులు దాగియుండును. వారు కష్టముల కొప్పుకొనకున్నను స్వతంత్రవృత్తుల బూనకున్నను స్థిరమనస్కులు గల్పించు నీత్యావేశములకు వశులయి, ఎంతకార్యములనైన జేయబూనుదురు. వారి నీతిశక్తులు ధైర్యస్థైర్యములు నిద్రించుచుండును. వాటిని లేపినచో వారిపూనికకు మితిలేదు. వారి నీచప్రవృత్తులనుండి మరలించుటకును బుణ్యావేశములతో బూరించుటకును సం

స్కర్తలందు నీతిశక్తివిశేషములుండవలయును. సంస్కర్తల నడవడిక జనులవిశ్వాసముల బొందగలిగి యుండవలయును. పుణ్యాదర్శములే పుణ్యావేశముల నియ్యగలవు. ధర్మాభిమానముచే బుణ్యాదర్శము లుద్భవించును. ఉదయవధీరులు జనుల కుత్తమధర్మములను నూతనాదర్శములను జూపి సంకల్పసిద్ధులగుచున్నారు. సంస్కర్తల నీత్యౌదేశికములను పుణ్యభావములను జూచి జనులు పుణ్యధీరుల వశమగుచున్నారు. రాజాంగసంస్కర్తలు జనుల కభినివార్థముల బ్రకటించి తమపుణ్యబలముచేతను దమ యనివార్య నిరోధభావములచేతను బుద్ధిశక్తుల ప్రయోగముచేతను మహోద్యమముల సాధించుచుందురు. మనుజులందరు దైవచిహ్నములగు నీతిగుణముల గలిగియున్నారు. వారి కక్రమముగా నొత్తిడిగలిగినను వారిని దౌర్జన్యముచే బీడించినను వారియం దద్భుతశక్తులుదయించును. వారలందు నిద్రించుదైవము మేల్కొని తనయనంతశక్తి ప్రభావముల జూపట్టుచునుండును. మానవజాతి ఘోరకృత్యములను దీర్ఘకాల మోర్చియుండదు. సుఖాశ్రితులైనను మనుజులు మితసహనము గలిగియున్నారు. నియోజ్యులు (ప్రతినిధులు) పక్షపాతములనుకక్షలను వహించి తమసంఖ్యనునమ్మికొని చిరకాలము లఘుసంఘముల బీడింతురనుటకల్ల. ఇంగ్లాండుదేశమందు యోధులను (జాన్) కాథొలికులనుబీడింపగలిగిరా? వారందరు నవష్టిని బ్రతుకుచుండగా నాగ్యులుపరపీడాపరులా? స్వపరిపాలనగల దేశీయులందరు నేకవసపక్షులా? వారందరు నంతఃకలహములు లేకుండ జీవించుటలేదా? వారందరు ఒకరిగొంతుక మరియొకరు గోయుచుండుటలేదు.

వారందరు ఒకరిసొత్తుల నొకరపహరించుటలేదు. వారందరు
సమబుద్ధి గలిగియున్నారు. వారి ప్రతిస్పర్ధలను పురికొల్పు వా
ణిజ్యవృత్తులందును కూడ సోదరభావముతో నొకరినొకరు
తోడ్పడుచున్నారు. భాషాభేదములను మతభేదములను మరచి
సహనపూరితులై వారిదేశాభివృద్ధి కగుసుగు మార్గములందును,
వారి రాజ్యాంగపాలనమునందును పరస్పరానురక్తులై యుండగా
బుణ్యభూమియనియు యజ్ఞవాటిక యనియు బేరొందినయు
త్తమభారతజాతివారందరు స్వపాలనసిద్ధించిన మరునాడే తమ
లో తాము కొట్టుకొని చచ్చెదరనుటకంటె నెక్కువ యసత్యము
ను మే మూహింపజాలకున్నాము. ఇట్టి జాతీయదూషణయందు
దేశాభిమానులుగూడ భ్రమజెందుదురు. అవస్థానుగతులై మన
వారట్టి దౌష్ట్యములను జేయుచుండినను మానవకోటియందెల్ల
నార్యజాతి నీతిధర్మములకు బ్రసిద్ధిగాంచినది. చీమలనైనను
ద్రొక్కజాలనట్టియు వృశ్చికములనైన జంపజాలనట్టియు నీ
పుణ్యజాతి యంతఃకలహములచే నంతమొందుననుట కల్ల. వాకిటి
కేగువానికెల్ల దానమిడునట్టియు నతిథులనెల్ల యాదరించి
పూజించునట్టియు ఆర్యపుత్రులందరు బరస్పరహత్యల గావించి
నెతురుద్రావి చత్తురనుటను మాచదువరులలో నెవరైననమ్మె
దరా? మనకంటె నెక్కుడుభూతదయ గలవారెవరు? సహనము
దానము, భూతదయాళుత్వము మనపుణ్యభూమియందు సిద్ధి
గాంచెనని పాశ్చాత్యులుగూడ వేనోళ్ళజెప్పుచున్నారు. ఆర్య
వాటికయందున్న వారందరు దుర్మార్గపిశాచములనియు శ్వే
తముఖులందరు సగుణబ్రహ్మలనియు దుర్బోధలు దేశమం
దంతట బరతంత్రులచే వ్యాపింపబడినవి. ఈమాయాప్రకటన

లను మనలోని నేకులునమ్మి భ్రమలపాలగుచున్నారు. కాను క్రోధాదులు పాశ్చాత్యులు నంటివా? వారిదేశములలో వ్యాజ్యములు వేయువారును పోట్లాటలచే జీవించువారును లేరా? వారిదేశములందలి ఘాతుకకృత్యములను దినదినము వార్తాపత్రికలయందే చూచుటలేదా? వారు స్వార్థపరులై, మనమందరము దుర్మార్గపిశాచములమని చెప్పినంత మాత్రాన మనమట్టి దుర్మతము నంగీకరింతుమా?

ప్రతినిధుల నియోజకధర్మములను వివరముగా వర్ణింతము. దేశమంతయు ప్రతినిధిత్వాలయములు (Electorates) గా భాగింపబడును. ఇట్టియాలయముల పరిమాణము భూవైశాల్యమును బట్టి యుండదు. దేశీయులందరు సమానాధికారులు. మైనార్టీవెళ్ళిన పురుషులందరును స్వతంత్రముతో వ్యవహరించు స్త్రీలును సమానాధికారులు. వీరందరు దమసందేశములచే నియోజ్యుల (ప్రతినిధుల)ను నియమింతురు. దేశమందున్న జనసంఖ్య ననుసరించి నియోగాలయములు నిర్ణయింపబడును. ప్రతినిధిత్వ సభకు వలయు నియోజ్యులసంఖ్యచే జనసంఖ్యను భాగించినచో నొకయాలయమందు గలనియోగుల (Electors) సంఖ్యదెలియును. ఒకదేశమందు 3,00,000 జనులుండి వారికి ముప్పదిమంది ప్రతినిధులు వలసినచో బదివేలమంది కొకప్రతినిధి నేమింపబడును. ఇట్లు దేశమంతయు బదివేలసంఖ్యగల భాగములుగా భాగింపబడును. నియోగసమయమందు జనాభిమానులును దేశీయులు నగు నియోజ్యులందరు దమ రాజకీయాభిప్రాయములను యోగ్యతలను, జనులకు జెప్పుకొనియెదరు. సభలందును, పత్రికలందును వారియోగ్య



తలు జర్పింపబడును. నియోగులగు జనులందరును దమ నియో గాలయము నందు సందేశస్థలము (Place of voting) నకు వచ్చి తమ యభిమతముల ననుసరించు నని వ్రాసుకొను నియో గ్యునిపే రొక చిన్న పత్రికమీద వ్రాసి పత్రికలనుంచు పెట్టె లో దాను వ్రాసినపేరు నితరులకు జూపకుండ వేసిపోవును. ఇట్లు ప్రతివారు దమకిష్టులగు వానిపేర చీట్లువేయుదురు. ఈచీట్లపెట్టె తగుమంది పెద్దలయెదుట దెరువబడును. చీట్ల నెంచి యెక్కువచీట్లెవరి పేరును జూపునో వారి న్యాయాలయ మునకు బ్రతినిధులగా నియోగించెదరు. ఇది వెంటనే ప్రక టింపబడును. నియోగులందరును దమ ప్రతినిధిగుణములను దెలిసికొని పరిశీలించి తనకు దోచినట్లు తన సందేశము నిచ్చును. నియోగులందరు దమ నియోగ్యులందరిని జూచి మాట్లాడు కొనవలయును. నియోగ్యులందరు నియోగులను సభలందును గృహములందును గలసి మాట్లాడుకొనవలయును. నియో జ్యులు నియోగుల యభిప్రాయముల కనువర్తులు. నియో జ్యుడు మతములచేతను మనోవృత్తులచేతను నియోగికను రూపి కానియెడల వానిని నియమింపగూడదు. ప్రతినిధి తన నియోగాలయమందుండు స్థానికధర్మములను, యాచారము లను, నియోగుల యావశ్యకములను వివరించి తెలిసికొని యుండవలయును. నియోగ్యుడు దాను ప్రతినిధిగా నుండ దలచు యాలయనివాసస్థుడైనచో బాగుండును. నియోగులు తమ మధ్యనుండువారిని నియోగించినచో దమయావశ్యకముల నెక్కువ స్పష్టముగా ప్రతినిధిసభయందు నియోజ్యుడు ప్రక టింపగలడు. కాని స్థానికనివాసుడు గానంతమాత్రమున గుణ

వంతుల విడనాడగూడదు. నియోజ్యులందరు వారి నియోగు లం దభిమాన ముంచకమానరు. వారినడత క్రమముగానుం డనియెడ వెంటనే నియోగులందరునుగూడి సభనుండి వాని నిర్వాస్యము గావింపవచ్చును. ఇట్టి పద్ధతులవలన నాలయము లందు బలుకుబడిగల ప్రముఖులు సామాన్యముగా నియో గింపబడుదురు. పలుకుబడి లేనియెడ కేవలము ప్రజ్ఞావిశేష ములవల్లనో, ధనవ్యయమువల్లనో నియోగింప బడుదురు. నియోగులు దురభిమానులై పక్షపాతములను, కక్షలను వహిం చియో లంచముల నందుకొనియో, నియోగ్యులలో నుత్తము నికి దమ యధికార మొసగక దేశసేవమును గోల్పోవుచుం దురు. జనసమూహము విద్యాధికులు గానందున దమకుప్రియ వచనముల జెప్పువారిని నియమించుచుందురు. ఉన్నతనీతిగుణ ములను, విద్యలను గలవారి నాదరింపకుండుట జనుల దోష ముగా దోచదు. ప్రబలమనస్కులును ప్రాజ్ఞులును జనసము దాయమునకుండు మాధ్యమున కనువర్తనులుగా నుండజా లరు. వారి యభిప్రాయము లొకప్పుడు సామాన్యుల యభి మతముల కనురూపములుగా నుండనేరవు. వారు స్వగౌర వము గలిగియుందురు. సామాన్యుల నంపరి నాశ్రయించి వారితో ప్రియవచనముల జెప్పుచు దమకాలమును శక్తిని వ్యర్థపరచుకొనరు. ఇందువలన నుత్తమ ప్రజ్ఞావంతులందరు సాధారణముగా జనుల నాశ్రయించి నియోగములందు నిగ్ర హించి యధికారస్థానముల నపేక్షింపరు. అధికారకాంక్ష కీర్తి కామము పుణ్యపురుషుల నంటజాలదు. మహాత్ములను మా త్రమే రాజకీయసభలకు దెచ్చు నియోగధర్మముల నేజాతి



వారును మిక్కిలిగా ననుష్ఠించుటలేదు. అనేకులు లోకోప కారము చేతను సుగుణ సంపదలచేతను నీతిశక్తులచేతను గీర్తి గాంచుచుందురు. విద్యావంతులుమాత్రమే పుణ్యపురుషుల గుర్తెరిగి మన్నింపగలరు. పామరులు జ్ఞానధీరుల బూజించు టరుదు. కనుక నియోగములందు వారు సంఖ్యాబలమును సాధించుటకష్టము. నియోజ్యులుగా పైకివచ్చు ప్రముఖులు వారి నియోగాలయములందు మాత్రమే తెలిసికొనబడుచుం దురు. విద్వాంసులకీర్తి దేశమందంతటను వ్యాపించియుం డును. వీరెయం దభిమానము గలవారందరి సంఖ్యయొక్క నియోగాలయ మందుండు నియోగుల (electors) సంఖ్యకు మించియుండును. ఇట్టిసందర్భమున గీర్తిపురుషులకు నియోగ మెట్లు ప్రాప్తించునో విచారింతము. వీరినెన్నుకొనుట కిష్ట పడు నియోగుల సందేశములను విడిగా దీసికొనినచో వీరును సభల నలంకరింపవచ్చును. వీరిని బూజించుట మానవకోటికి శ్రేయస్కరము. వీరు లోకహితులు దూరదృష్టిగలవారు. వీరి పుణ్యచింతనములచేతను నీతిభావముల చేతను నియోజ్యుల సభలు దేవాలయములగును. ఇట్టి నియోగపద్ధతి భూవైశా ల్యములను మరిపించును. ఇట్టిపద్ధతుల చే లఘుసంఘములును గూడ తమసంఖ్యకు దగునటుల నియోజ్యుల నంపుకొనవచ్చు ను ఇట్టి పద్ధతివల్ల ననేకతగాదాలు మానిపోవును. నియోగుల జాపితాలను (elector's lists) జక్కగ సమకూర్చినచో వీలు కలుగును. నియోగులెవరైన నొక్కచీటీని మాత్రమే వేయ గలరు. రెండుమూడు చీట్లను వేయుగల యధికారమెవ్వరికిని లేదు. ఏమనుజుడును నియోగ్యుల నిద్దరి నేకకాలమందు

జేరొక్కనజాలడు. ఏమనుజుడును రెండుజాబితాల (నియోగు లనామముల దెలుపుపత్రికలు) లో తన నామము నుంచు కొనజాలడు.

ప్రతియుపసంఘమువారును వారి యభిమతముల సాధింపదగువానిని నియోగించుకొనియెదరు. పైజెప్పిన పద్ధతి నవలంబించినచో దేశీయులందరి సమానాధికారము సార్థక మగుచున్నది. మనదేశమందు హిందువులు, తురుష్కులు, క్రైస్తవులు, పారసీకులు వివిధజాతులవా రున్నారు. వీరందరికి రాజకీయ విషయములం దెంతమాత్రము ప్రతిరోధములు లేవు. వీరందరు వారిమతములందు బూర్ణాభిమానమును గలిగి యున్నారు. హిందువులు వారి స్వభావముచేతను వారి మత ధర్మములచేతను పరమతములవారికి సహనము జూపుచుందురు. హిందువులందు ననురాగవృత్తులు ప్రబలముగా నున్నవి వృత్తి భేదముల నాశ్రయించి హిందువుల మతము నానావిధముల వ్యాపించియున్నది. తురుష్కు లితరమతములయెడ సమబుద్ధిని జూపరు కాని వారిలో విద్వాంసులందరు న్యాయబుద్ధిని జూపు చునేయున్నారు. మహమ్మదీయుల మతమందును వైదికమత మందునుకూడ వైరాగ్య వృత్తులే బోధింపబడుచున్నవి. వైరాగ్యము, భూతదయ, హిందువులకును మహమ్మదీయులకును గూడ ముఖ్యమే. ఇందువలన వీరికి మతవైర ముండజాలదు. వీరు హిందువులయెడ జూపువైరము పామరత్వముచే గలుగు చున్నది. దేశమునందు విద్య విరివిగా వ్యాపించినచో నిట్టిదురవస్థలు గలుగనేరవు. మనదేశమందలి తురుష్కు లనేకు లార్య మతమువారె. కాలవశముచే వారు పరమతముల నవలంబించ

వలసివచ్చినది. వీరి పండుగలందు గానవద్యు యుత్సవ వైభవ మంతయు హిందువుల యన్యోన్యముచే గలుగుచున్నది.

ఆర్యులందుత్తమ కులములవారు కూడ వారి శూద్రులకు గానుకల నిచ్చుచున్నారు. ప్రతినిధిత్వపాలనలో లఘుసంఘములకు న్యాయము జరుగదనుట విశ్వాసనీయము కాదు. నిజాము రాజ్యమందలి జనులు హిందువులు నవాబులు మొగలాయి జాతివారు తురకలనేకులు గొప్పయధికారముల గలిగియున్నారు. ఈ రాజ్యమందు హిందువులకు తురకలకు కలహములు జరుగుచుండుట లేదు. కాశ్మీర దేశపురాజులు హిందువులు పాలితులనేకులు మహమ్మదీయులు, ఈదేశమందు హిందువులు గొందరు గొప్పయుద్యోగములలో నున్నారు. ఈ దేశమం దిట్టిజాతీయసమస్య లేదు. జనాభాసంఖ్యలనుబట్టి పంజాబున 100 కి 38 మందుగురు హిందువులు, 53 తురుష్కులు. తూర్పు వంగదేశమందు 100 కి 37 హిందువులు, 58 తురుష్కులు. బొంబాయి రాజధానియందు 100 కి 77 రు హిందువులు, 20 మంది తురుష్కులు. మనమండలమందు 89 హిందువుల కార్గురు తురుష్కులు. నియోగమువల్ల గలుగు భారత మహామండల సభకు హిందువులను మహమ్మదీయులను గూడ నంపవచ్చును. ఈ రెండుజాతులవారును వాణిజ్య రాజకీయ విషయములందు నన్యోన్యప్రవృత్తిచే మిక్కిలిలాభముల బొందుచున్నారు. ఒకమండల (రాజధాని) మందు తురుష్కులెక్కువగానున్నను మరియొకమండలమందు హిందువులెక్కువగా యున్నను అంతఃకలహములు గలుగుననుట కల్ల. పంజాబునందలి హిందువులకు చిక్కులుగలిగినయెడ మద్రాసు మండలమందు



నలి హిందువులు భ్రాతృభావమును జ్ఞాపకముంచరు. మద్రాసు మండల మందలి తురుష్కులకు హిందువు లన్యాయము జేసిన యెడ తూర్పు వంగదేశమందును, పంజాబు దేశమందును, నివసించు తురుష్కు లచ్చటి హిందువులకు బ్రతీకారము జేయక మానరు. ఇట్టి పరస్పరతవల్లను మండలసభలందుండువారు ఘనతకు హించిన విద్యాధికులగుటవల్లను తురుష్కులు హిందువులకంటె నెక్కువ వీరవృత్తులగలిగి యుండుటవల్లను, మద్రా వేశముల కవకాశముండదని నమ్మవచ్చును. రాజకీయసభలందు మతవిషయములు రానేరవు. మన నియోజ్యులు రాజకీయావశ్యములు మాత్రమే సవర్ధింపగలరు. మతవిషయికము లందు సంస్కరణముల జేయుటకు వీరికధికారము లేదు. కావున్నను స్వరాజ్యము వచ్చినతోడనే మతములు, సాంప్రదాయములు, కులాచారములు పరిభ్రమణము గాంచుననుట పిచ్చిస్వప్నము. రాజకీయసమావేశములందు విరోధముండుటకు గారణము గానరాదు. మండలసభలు మహామండల సభకనుకరణములు. దీనికవి యనుకృత్యములైయుండును. మండలసభలందు జనసంఖ్యననుసరించి 30 మొదలు 60 వరకు నియోజ్యులుందురు. మహామండలసభయందు 400 లేక 500 మంది యుండవచ్చును మహామండలసభయందు రాజ్యభారమంతయును సమర్థింపబడును. ముఖ్యశాసనములు జేయబడును. రాజ్యాంగాధిపతులగు మంత్రులకు విధివిధానముల నియమించును. మండల స్థానిక వ్యవహారముల బాలించుటకు వలయు చట్టములను మండలసభలు జేయుచుండును. మండలసభవారి నూతనచట్టముల నంగీకరించుటకు, దీసివేయుటకు వగు మార్పులను మాత్ర



మే చేయుటకు మహామండలసభ వారి కధికారముండును. మండలసభలకు వలయు నాలోచనలను కూడ చెప్పుచుండును, కాని మండలసభ స్థానికపాలన వివరణములందు మాత్రము స్వాతంత్ర్యమును గలిగియుండును. కనుక మహామండలసభ యందెక్కువమంది నియోజ్యులుండవలయును. నియోజ్యులు (ప్రతినిధులు) మంత్రుల ప్రేరణముల బరిశీలించి తమనియోగుల యావశ్యకముల విమర్శించి వారియభిమతముల నొక్కివక్కాణించి స్థానికసందర్భములను బ్రదర్శించి చెప్పి శాసనముల నియమింతురు ఇట్టి సంఘములు దమయభీష్టకార్యముల బడయవచ్చును. కాని కొన్ని సమయములం దుపసంఘములవారి నియోజ్యులు బహుసంఘమువారి నియోజ్యుల సముదాయాభిప్రాయములకు లోబడవలసివచ్చును. బహుసంఘమువారి నియోజ్యుల సంఖ్యను మితపరచి లఘుసంఘమువారి నియోజ్యులసంఖ్యను పెంచుట న్యాయవిరుద్ధము. మానవస్థాపితము లెప్పుడును బరిపూర్ణత జెందనేరవు. లోకమునం దెప్పుడును నిరోధమునకు దగు న్యాయప్రేరణము లుండవలయును. బహుసంఘము లన్ని దేశములందును గలవు. మనుజులందరు నేకమతస్థులై యుండుట యసంభవము అట్లుండినచో నిరోధమున కవకాశత లేక జీవము రుచికరముగనుండదు. అనురోధము నిరోధము మనసునకు ముఖ్యవృత్తులు. వీటిచే లోకము గదలిక జెందుచున్నది. లఘుసంఘములను బీడించినచో వారు మాయోపాయములచేతనో నిరోధకృత్యులచేతనో వారి క్షేమమును గాపాడుకొందురు

ఇదిట్లుంచి మరియొక విశేషమును విచారింతము. నియోజ్యుల సముదాయాభిప్రాయములచే రాజ్యాంగాధిపతులు



నియమింపబడెదరు. అంగాధిపతులే మంత్రులు. అధికారానుష్ఠానము మంత్రులందు సంకేతమగుచున్నది. మంత్రివర్గము పాలిటీనుండి విధేయతను గోరుచుందురు. వారి యాజ్ఞలు వారధికారస్థానములందున్న కాలమందు నిరాటంకముగా నందరు నవలంబించవలయును. అధికారులు వారిపనితొందరలచేతను పక్షపాతముచేతను అధికారాంధతచేతను మనోవృత్తిభేదముల చేతను గొందరియభిమతముల దిరస్కరింపకమానరు. వీరు స్వప్రావృత్తుల బూనకమానరు. మనుజుల కధికారకాంక్ష నైజగుణము. వీరందరు సంఘీభవింతురు. లఘుపక్షము లిట్లొకప్పుడు సంగమించి బహుసంఘమును వారి యంగసౌష్టవముచే బెదరించెదరు. బహుపక్షమువారు జూడని యాదర్శముల లఘుపక్షమువారుజూతురు. ఈ స్పర్థ దేశమునకు సౌఖ్యకరము. ఇరుపక్షములవారి బుద్ధిశక్తులచే సాంఘికశక్తి మథింపబడును. ఆలోచనలు పక్వమగును. క్రొత్తపన్నుల విధింపబూనినను దేశముల యొక్క ఋణముల బెంచబూనినను, వ్యయములను తగ్గించు మార్గములను లఘుపక్షమువారు వెల్లడిచేయుచుందురు. రాజకీయావశ్యకముల యథార్థపరిమాణములను నిరూపించి దుర్వ్యయముల నాపుచుందురు. ఇటుల నన్నిపక్షములవారును గార్యనిర్వాహకులగుచున్నారు. ఇటుల మండలసభలందును మహామండలసభయందును స్పర్థావైరములు శ్రేయస్కరము. సత్యము, న్యాయము, శౌచము దప్పకుండ నీతిశక్తులతోను బుద్ధిసూక్ష్మముతోను బాలించుకొనినచో స్వరాజ్యాంగము సార్థకము కాగలదు. ఇటుల జేయనిచో స్వరాజ్యము అరాజకమునకు మారుపేరగును. రాజ్యాంగములందు

జమలెక్కువ జోక్యమును గలుగజేసికొనని యెడ పాలనము నెరవేరదు. జనులందరు కార్యభారమును బూననియెడ రాజ్యా కాంక్షగలవా రెవరో కొందరు రాజ్యాంగమును వశపరచు కొని మాయోపాయములచే క్రమముగా సర్వాధికారము నపహరింతురు. అమెరికా ఖండవాసులగు సంయుక్త రాష్ట్రము లవారును ఫ్రెంచివారును, స్విడ్జర్లాండు, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా, మొదలగు దేశములందు అనేకవిధములగు స్వపరి పాలనము లుత్తమోత్తమ గతులను జూపుచున్నవి. పరదేశ ములవారు వీరిని వేనోళ్ల బొగడుచున్నారు. సర్వసంపదలకు స్వాతంత్ర్యమూ ధారము. స్వాతంత్ర్యము స్వశక్తుల నభివృద్ధిజే యును. వ్యక్తులందరు పట్టాభిషిక్తులు.





# సంశయవపరికరణము



శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూత నిజాత్మని
ఈక్షతేయోగయుక్తాత్మా సర్వత్రి సమదర్శనః॥

తా॥ యోగయుక్తమైన మనస్సుగలవాడు సర్వభూతములను సమముగ జూచువాడగుచు సమస్తభూతములందు తానును, తనయందు సమస్త భూతములును, నుండునట్లు జూచును.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్రి సమంపశ్యతి యోర్జున
సుఖంవాయ దివాదుఃఖం సయోగీ పరమోమతః॥

తా॥ అర్జునా! సర్వభూత సుఖదుఃఖములను తనసుఖదుఃఖములుగా భావించువాడు నాకు సమ్మతమైన పరమయోగియగుచున్నాడు.

## సర్వస్వము.

రక్షణము సర్వజనీనము. ఆస్తిస్వామ్యము మానవజాతికంతకు ముఖ్యావశ్యకము. రాజ్యనియమము మానవసంపదలకు మూలకము శాసనములు సిరిసంపదలకు మూలబంధము. రాజ్యాంగము మానవార్థములకు బ్రిథమసాధిక. సంఘార్థములను మనుజులే తమ స్వాతంత్రివృత్తులచే భావింతురు. ఇట్టి మనోభావములను క్రమపరచి తదర్థముల సాధింపనవకాశతనొసగు యంగసౌష్ఠవమే రాజ్యము. మనోభావములు పరివేష్ఠితావస్థలచే నుత్క్రాంతిజెందును. వివిధావస్థకాల్పనికము లుత్క్రాంతములనబడును.ఉత్క్రాంతముల సంబంధా



నుబంధముల సముదాయము పరిణామము. భావార్థము లిట్లు మారుచుండును. ఇట్టి యవస్థాభేదముల సంధ్యవేళలందు నూతనాదర్శము లుదయించును. మనుజుండు వ్యక్తివంతుండు తనవ్యక్త్యాదర్శముల ననుష్ఠింప బూనును. ఇట్లు నూతనోద్యమము లుత్పత్తియగుచున్నవి. వ్యక్తివలెనే జాతియు నిట్టి పరిణామభేదముల జెందుచున్నది. వ్యక్తుల సముదాయస్వభావము జాతిని నిరూపించుచున్నది. ఇట్లనే యాదర్శములు మానవజాతిని యవస్థాత్రయము ననుసరించి వివిధోద్యమములకు బురికొల్పుచున్నది. శిక్షార్థులు లేని దేయుద్యమము సార్థకముగానేరదు. తంత్రము శక్తి కాలము కర్మకు నవయవములు. తంత్రమునకు యుక్తిప్రధానము. యుక్తులు బుద్ధికల్పితములు. సంఘీభావముచే శక్తిసౌష్టవ మేర్పడును. యుక్తిశక్తులు వ్యర్థము గాకుండుటకు కాలమును క్రమపరుపవలయును శక్తియుక్తులను గాలముతో సమ్మేళనము గావించుట కంగసౌష్టవము వ్యాపించి యుండవలయును. అంగసౌష్టవము సార్థకముగుటకు విధులను నియమింపవలయును. ఇట్టి సాంగోపాంగములగల విధిక్రమమును సాంఘిక విషయములం దాచార ధర్మములనియును, నీతియనియు, రాజకీయవిషయములందె ప్రభుత్వమనియు, శాసనములనియును, వాడుదురు. ఇట్లు సాంఘికవిధిక్రమమును బోధించు నీతియును రాజకీయవిధులను బోధించు శాసనములును, గూడ మానవకల్పితములు. వాటి యావశ్యకములే వాటి ప్రేరణములు. మనుష్యుల యావశ్యకములు వారియభీష్టములందు సూచింపబడుచున్నవి. ప్రజాభిప్రాయమే శక్తి.



ఆస్తిస్వామ్యము, ఆత్మరక్షణము కొరకు రాజ్యాంగములు గల్పింపబడుచున్నది. ప్రభుత్వములును నీతియును, వాటి యావశ్యకము లంతరించువరకు మాత్రము నిలిచియుండును. సాంఘికమనసు వాటినపేక్షించునంతవరకది నిర్వహించును. తమయవసరము లంతరించినపిదప జీర్ణవస్త్రములవలెనే రాజులను, రాజ్యాంగములను స్మృతులను, శాసనములను మానవకోటి విసర్జించుచుండును. తనకిచ్చవచ్చిన నూతన ధర్మములను నూతనరాజ్యాంగములను నూతనస్మృతులను యవలంబించుచున్నది. కృతయుగమునందొకప్పుడు సాంఘికమనసు క్షత్రియుల దౌర్జన్యముల కోర్వకుండెను. పరశురాముని ప్రచండాగ్నిచే క్షత్రియ దౌష్ట్యములు దగ్ధమాయెను. రఘువంశమువారొకరు మాత్రము ధర్మవర్తనులై దాగియుండిరట. పరశురాముడు తనబాణములను రామునిపై వేసెనట. కాని వానిబాణములువ్యర్థమాయెను. క్షత్రియుల జంప నవసరమింకలేదు గాబోలు, రామునిచే రాక్షసంహారము గావలసియుండెనేమో? పరశురామునిబాణము లానాటినుండియు నిస్సారములాయెను భారతయుద్ధానంతరమం దర్జునుని బాణములిట్లనే వ్యర్థమాయెను. వానిని ముందునడెప్ప వానిబుద్ధిశక్తుల బురికొల్పినట్టి ధర్మప్రేరణము లంతరించెను ధర్మప్రేరణములేని యుద్యోగములు గొనసాగవు తురుష్కులు హిందువులను, వారి పూర్వాచారములను భగ్నము జేయుట కొకప్పుడు బూనియుండిరట. హిందూజాతి యంతయును వెంటనే ధర్మాభిమానముతో నింపబడెను. కృష్ణదేవరాయలును, శివాజియును జాతీయ ధర్మరక్షణము నపేక్షించి మానవజాతినం



శయము నాత్మరక్షణమునకు బురిగొల్పిరి. తమకు రాజ్యకాంక్ష గల్గినదనియు, గిరీటముల నపేక్షించితిమనియు, జెప్పియంతమా త్రమున మనుష్యవర్గముల యుద్ధరంగమున ఘోరముగా బోర నను ప్రాణముల గోల్పోయి శూరులకు మాత్రము పట్టాభిషే కము గావించు వినోదము జూడగోరిరా? పానిపట్టు యుద్ధ మునందు లక్షలకొలది హిందువులు మడిసిరనియు నాటిదిన మున మహారాష్ట్ర దేశమం దింటింటను దుఃఖము వ్యాపించి యు నెవరును వినియుండిరి. వీరందరు నింతపరాక్రమముతో బోరాడి చచ్చుటకు వీరిమనమునందుండు ప్రేరణమేది? వీరివా రికి రాజ్యము లేకపోయెననియా? తమ జాతీయ ధర్మముల రక్షింప వలయుననియా? ప్రభువుల కొరకే రాజ్యము నేర్పడి యుండలేదు. కొన్ని ధర్మముల కొరకొకప్పుడు, మరికొన్ని ధర్మములకు మరియొకప్పుడును, మనుష్యజాతి సంఘీభవించి అంగసౌష్ఠవముచే ధర్మముల సాధించుచున్నది. ఇట్లనే సాం ఘికవిషయములందును దేశకాల పాత్రల ననుసరించి యనే కాచారములు వివిధనీతిమార్గములు నుత్పత్తియగుచున్నవి. మలయాళ దేశమున దిరువది సంవత్సరములనాటి నీతినియమ ములిప్పు డరుదగుచున్నవి. వివాహకర్మములు మనదేశము నందునే పలువిధములుగా నున్నవి. మనపూర్వు లొకప్పుడు గోమాంస భక్షకులట. సోదరుని భార్యకు వారసుల బుట్టింప వచ్చునట. ప్రౌఢవివాహములును స్వయంవరములును సామా న్యవిషయములే. మానవకల్పితములగు సాంఘిక రాజకీయ ధర్మ ములిట్లు బరిణామభేదముల నొందుచుండును. రాజ్యములును మతములును, దేశకాలము ననుసరించి వచ్చుచు బోవుచుం



డును వాటినోల్పించిన యావశ్యకము లంతరించినవెంటనే ఇసుకతో వేసిన కోటిచందమున నెంత సాంగోపాంగమైనను భగ్నమైపోవును ఇట్లు మనుష్యజాతి సమయోచితమగు ధర్మముల గావించుటచే నాత్మరక్షణము చేసికొని కాలము నిద్రించుచున్నది. పామరులగు జనసామాన్యము మానవధర్మములను శిలాశాసనములుగా నెంతురు గాని ప్రాజ్ఞులగువారవి జలభాజనముభంగి మానసిక వృత్తుల నాశ్రయించి భేదించుచున్నవని యెరుంగుదురు. అయినను మానవజాతి కేవలము అస్థావరమై యుండలేదు. స్థితిగతులును మానవకల్పితములే. మానవజాతి స్థితిగతులను వాహనమున నీడ్వబడుచుండుట లేదు. వారి మనోగుణములే వారిని జల్లకవ్వమువగిది ముందుకు వెనుకకు ద్రిప్పుచున్నవి. మనఃప్రకృతులు, జడాజడములు, పరస్పరముగా నన్యథాకరించుచున్నవి.

రాజ్యాంగములు మానవార్థముల సాధించుట కవకాశ మిచ్చుచున్నవి. రాజ్యాంగము పరమార్థము గానేరదు. పరమార్థసిద్ధికి ముఖ్యావకాశత నిచ్చును. మానవార్థములు రాజ్యాంగములచే నిర్ణయింపబడుచుండుట లేదు. రాజ్యాంగము మానవాభివృద్ధికి ముఖ్యావశ్యకము. పరమార్థముల కనుగుణ్యముగాని రాజ్యాంగము నిలువజాలదు. రాజ్యాంగముల నపహరించువా రెవరును లేరు. రాజ్యాపహారులను మానవజాతి వెంటనే నాశన మొనరించును. రాజ్యాంగము పరమార్థమున కనుబంధమైయున్నది విద్య కాలక్రమంబున పెంపొందుచున్నది. పరంపరలై పాత జ్ఞానతరంగములు నూతనాదర్శముల జూపుచున్నది. చరిత్రలును, వేదవేదాంగములును,



పురాణములును మనుష్యానుభుక్తములు. [illegible]లు, శాస్త్రములు, శిల్పనములు, బుద్ధిశక్తుల చరిత్రను చాటించుచున్నవి. మన స్వాతీయము; అనంతము. విశ్వాసనోత్తేజము శాఖోపశాఖలుగా జంతుసముదాయములందు బాగుచున్నది అభివృద్ధి మనుజుని ముఖ్య గుణము. మనుజులందరు నాద్యంతములందు సమానులు. సంఘీభావ మభివృద్ధికి ముఖ్యము. ఐకమత్యము చేస సంఘీభావము బూర్ణతజెందును. ఐకమత్యము సమత్వమందు సిద్ధినొందును ఇట్లుత్తమ రాజ్యాంగపాలనమందు జనులందరు నధికారపోషకు లగుచుండుట న్యాయము సామాజికులందరు సమాజమునం దవయవన్యాయమున వర్తించి ఐక్యమొందుట జాతీయసిద్ధి. అట్టి యంగసౌష్ఠవ నిర్వాహకత్వము దందరు సమానులే. పాలితులందరు పట్టాభిషిక్తులు. ఇట్టి స్థితియందు వ్యష్టిజీవము సమష్టి ప్రవృత్తులందును లీనమగుచున్నది. వ్యక్తిసంఘములు లభేద్యములు. సర్వస్వ మిట్లు సిద్ధించుచున్నది ఐక్య మిచ్చుట సార్థకమగుచున్నది సంఘీభావము నిజపరమార్థముల నిపుడు సాధింపగలదు ఇట్టి యాదర్శముల నవలంబించిన పాశ్చాత్త్య లోకము ప్రధర్మమును బ్రకటించిరి. వారు స్వపరిపాలనమగు రాజ్యాంగసౌష్ఠవమునే పరమార్థముగా నెంచెదరు. మా దేశమందు విద్యాధికుల కుద్యోగమే ప్రియదేవత. పశ్చిమదేశములందు నియోగమే (Election) ముఖ్యదైవము. స్వరాజ్యమువల్లఁ గలుగు తాత్కాలిక ఫలములనే వీరున్నతార్థములుగా భావించి రాజ్యసంపదలు భాజ్యమనియు, పాలితులందరు భాజికులనియు, లబ్ధమగు సౌఖ్యమును దామనుభవించుచుంటిమనియు భ్రమించుచున్నారు.



సిరిసంపదలు ... జ్యదత్తములుగావు. రాజ్యమును, సంపదలును గతానుగతికులు. రాజ్యమును, మానవార్థముల సాధించుట కవకాశత నొసగు సాంఘికావస్థాబంధమని యెంచి పాశ్చాత్యుల రాజకీయదర్శనము నొక యుపమానపూర్వకముగా విచారింతము. వెన్నెలయుండినచో బాటసారి తనయూరికి సులభముగా బోవును చీకటిరాత్రిని నడచువానికి భయమును, నిరోధము గలుగవచ్చును వెన్నెలతో బాటొక పోలీసువాడు గూడ వెంబడించుననుకొందము. చంద్రికయు, రక్షకభటుడును పథికునికి సహాయమొనర్చును. కాని వాని శక్తియే వానిని నడపుచున్నది. వాని బుద్ధియే వానిని ప్రేరేపించుచున్నది. వాని శక్తియుక్తుల ననుసరించి వాని కార్యము నెరవేరును. వెన్నెలయు వెంటవచ్చువాడును, వాడు వెళ్ళునట్టి కార్యముల సాధింతురా? వాని కార్యము సిద్ధించినచో చంద్రికను, రక్షకభటుని, గొనియాడవచ్చును. చంద్రికయే సాంఘికనీతి. రక్షకుడే రాజ్యాంగసౌష్ఠవము. మనుజులు సనకూడి కట్టుదిట్టముల చేతను, విద్యాశిక్షల నియమము చేతను, ఇష్టార్థసిద్ధికవకాశతను గల్పించుకొనుచున్నారు. ఇట్టి యవకాశత యని భాజ్యము, భాజకము, లబ్ధములను అనుశబ్దములు నిచ్చట నన్వయింపవు. రక్షకభటుడు పథికుని భృత్యుడయినచో నది స్వపరిపాలనము. ఇంతకు రాజ్యాంగాదర్శనము లెట్లున్నను ఆస్తి, సామ్యము, రక్షణము రాజ్యాంగ మొసగు నవకాశతకు ముఖ్యగుణములు. కనుక వీటిని నిర్వహించుటయే పాలనమునకు ముఖ్యవిధి.



మనుజులందరు సమానులనుటకు మరి నీచశంక గలదు. మనుజులందరు గలిమితెలువులచే నసమానులగు చున్నారు. సంఘమందు సిరిసంపదలు భేదముగనున్నను వస్తు కాంక్ష యెల్లరకు సమానము. రిక్తునకు జీర్ణవస్త్రములందును రాజునకు కిరీటఖడ్గములందును గల కాంక్షసమానమే. రహితులు కాడికిటను గురించియు, రాజులు సరిహద్దులను గురించియు నావేశములపాలై తమకోర్కెల సాధించుటలో సమానులే. ఆస్తి స్వాతంత్ర్యము నందరు సమముగా నపేక్షించెదరు. ఆస్తి పరిమాణములను బట్టి వస్తుకాంక్ష గలుగు ననుట కంటె నెక్కువ దురభిప్రాయ మేమియు లేదు. వారసత్వమువల్లను, నిజశక్తియుక్తుల వల్లను, మానవులు సంపద బడయుచున్నారు. రాజ్యము పాలితుల కందరికి సమానావకాశత నిచ్చుచున్నది ఇట్టి యవకాశత నాశ్రయించి మనుజులందరు సంపదల సాధింపబూనుదురు. పేదల గుడిసెలను, ధనికుల దివ్యభవనములను, వీరి మూలధనములను వారి వేతనములను రాజ్యము సమముగ గాపాడుచున్నది. సంపదలు మితము. సంపదల స్వామ్య మనంతము. ప్రతివారును దమ చరస్థిరాస్తులను గలిగి యుండుటందు సమాన స్వతంత్రులే. వారివారి వస్తువులందు వారికుండు స్వామ్య మనంతము. వస్తు స్వామ్యమున నందరు సమానులే గనుక స్వాతంత్ర్యమును, స్వామ్యాధికారమును, సంపత్తి సమముగా రక్షింపబడవలయును. ఇట్టి రక్షణమును బొందుటలో నందరుసమానులే. సంపదల స్థిరములు ఆస్తి స్థలభేదముల జెందుచున్నను స్వామ్యము స్థిరము.

వస్తువుండు వరకు దానిస్వాతంత్ర్యముండును. స్థలభేదములు స్వాతంత్ర్యమును మార్చవేవు.

ఇక ప్రజ్ఞాభేదములను గురించి విచారింతము. విద్యా ప్రజ్ఞలు వస్తువులవలె నెవరికిని బూర్ణస్వాతంత్ర్యమును గలుగ జేయవు. విద్యలస్వాతంత్ర్యము సంఘములందుండును. సంఘము నందుండు విద్యలన్నియు వారి పూర్వార్జితములు. విద్యల కందరును సమానవారసులు. ప్రజలందుండు విద్యావిశేషము లొక్క నాటి సంపాదితములు గావు. పారంపర్య సాంప్రదాయములచే విద్యలు బెంపొంది పోషింపబడు చుండును. గుణాదిసం ప్రదాయములు సాంఘిక సంచితములు. విద్యా స్వాతంత్ర్యము మానవజాతియం దున్నది. విద్యాస్వాతంత్ర్య మవిభాజ్యము. విద్యాధికులు విద్యలకు తాత్కాలికాశయు లగుచుందురు. సంసారకాంక్ష మనుజుని సహజగుణము. మనుజుని సంసార చింతనముచే మానవజాతి బెంపొందుచున్నది. విద్యాధికునికి విద్యయం దభిమానము తరజ్ఞానకాంక్షచె దానిని సాధించి వ్యాపింప జేయును. జ్ఞానధీరులే సంస్కర్తలు. విద్యాధికులేధర్మ స్థాపకులు. మనుష్యసేవయే వీరికి సహజగుణము. మానవజాతి యెడల వారు సమబుద్ధిజూపుదురు. మానవజాతియే వారికి దైవము. మానవాభివృద్ధియే వారికిష్టదైవము. విద్యావిద్యలు ఏకవస్తుదర్శనము లు. అవి యొక పత్రము యొక్క ద్విపతము లు. విద్యావిద్యలు అవియోగములు తమసిజత్రి ములందు జాయాపతులను బోలియుండును. వారిక్రీడా నోదములు విద్వాంసుల నానందింపజేయును. విద్వాంసుండు పూజ్యుడు. స్త్రీపురుషులు సమానులు. పండితులును, పామరులును, సోద



రన్యాయమున పరిసమానులు. అధికారకర్తలే యందు సమానులు, అధికారానుభవమం దసమానులు. విద్వాంసులే కార్యధురంధరులు కార్యనిర్వాహకములే వారి పారితోషకములు. మానవజాతియం దైక్యముజెందుటయేకీర్తి. త్యాగమే ముక్తి. విద్యావిశేష మే ప్రజ్ఞ, విద్వాంసుడే ప్రజ్ఞావంతుడు త్యాగము కీర్తిదాయకము. కీర్తి కాంక్ష ప్రజ్ఞావంతుల నైజగుణము. ప్రజ్ఞావిధు లనుబంధములు ఇట్టి పరస్పరత యభివృద్ధికరము. కీర్తిప్రజ్ఞలు ప్రమాణవశము కానేరవు. ప్రమాణము లేనికీర్తి ప్రజ్ఞలచే నధికారమును భాగించుటెటు? ఆస్తి విద్యలు సంబంధసామ్యమును జూపట్టవు. సంబంధసామ్యము లేనట్టి ఆస్తి విద్యాధికారములు మేళనమేళనముల కనుసంధాయకములు గానేరవు. కనుక రాజకీయవిషయకములం దందరును సమానులే. వానికందు విద్యాభేదములు గుణప్రదములు. పరిశ్రమతో విద్యాప్రజ్ఞలు సిద్ధించును. రాజకీయ విషయములం దట్టి భేదములు వర్తింపవు ఆస్తి విద్యల నిక వదలి లింగప్రాయభేదముల విచారింతము

మానవజాతి యంతయు నొక్కటియే. మనుష్యత్వ మవిభాజ్యము లింగప్రాయములచే మానవజాతి భిన్నముగుచున్నది. ఈభేదము దైవికము, అవయవభేదము, ఆకారభిన్నము, వ్యక్తి భేదముగాదు స్త్రీపురుషులంతరాత్మబుద్ధులు భిన్నములుగావు. ప్రాణులందు నుండు జీవ మొక్కటియే. అనంతమగు జీవము జీవులందు స్థానికముగా సంకేతమగుచున్నది. స్త్రీపురుషులు దమ నిజకీయ విధానములందు సమానులే. కాకున్నను రాజకీయ విషయము లందు లింగభేదము నాలో

చింప శక్తి యలేదు. ఇదెట్టి బుద్ధివైకల్యమోగాని వస్తు కాంక్షవలెనే అధికారకాంక్షయు నసహనమును గలుగ జేయుచున్నది. పరస్వాపహరణము మనుజునికి నైజగుణము గాబోలు! కాని స్వరాజ్యమున కాలవాలమగునట్టి పశ్చిమ దేశములందుగూడ లింగభేదము రాజకీయవిషయములలో ముఖ్యమగుట విచారణీయము. ఆస్తి స్వాతంత్ర్యము స్త్రీ పురుషుల కిద్దరికిని ముఖ్యమే రక్షణము పురుషునికంటె స్త్రీల కెక్కువ యవసరము. అట్టి స్థితిలో వారుభయుల యొప్పందముతోను దోడ్పాటుతోను రాజ్యాధికారము లెందుకు నిర్వహింపబడ గూడదో తోచకున్నది.

ఆదిమ వ్యవస్థలందు మానవజాతి సాంగోపాంగముగా సంక్షోభవించియుండదు. ఆ స్తిస్వామ్యము రక్షణము స్థిరముగా స్థాపింపబడియుండవు. ఈ స్థితిలో మనుజులందరును ఆత్మరక్షణము దామే చేసికొందురు. వేతనము లందుకొను శాశ్వత సైన్యము లుండవు. జనులందరు నాయుధధారులై యుందురు. ఆదిమసంఘములందు మనుజులు సాహసవృత్తిచే సాధ్యమగు భోజ్యముల సంగ్రహించి జీవింతురు. జీవితావశ్యకములను పురుషులే సాధింతురు. పారంపర్యము జీవరాశికి ముఖ్యము. జీవరాశియందు శిశురక్షణము మాతృధర్మమగుటచే గృహిణి స్థానికమై సాత్త్వికవృత్తుల నాశ్రయించుచుండును. ఈ స్థితి క్రమముగా మారిపోయి నాగరకతనొంది సాంఘిక శాంతిరక్షణముగల్గి సాత్త్విక పరిశ్రమలందు జీవితావశ్యకములను సాధించుచు సాంఘికార్థిక విషయములందు బహుస్వరూప వర్తనులై వెలయుచుండు జాయాపతులు దమ సమ్మతములతో కుటుంబ

పాలన మొనర్చుచుండియు, రాజకీయవిషయములందెప్పుడు తమ భూభారమును సమర్థించుకొనకుండుట విపరీతము. స్త్రీపురుషులకుండు మానవకల్పితమగు న్యూనాధిక్యత యాదిమ సాంఘికాచారములను జూపట్టును.

మన సంఘమునందన్నో పురాతనాచారము లెట్లున్నను మననాటి యబలలు బాహాటముగా సభాస్థలముల కరుదెంచుట లేదు. వీరు సామాన్యముగా నిల్లు విడువరు. సాంఘికావశ్యములను సాంఘికాభిప్రాయములను వీరెరుగరు. పరపురుషుల జూచుటతప్పు పరపురుషులును వారికై తలద్రిప్పగూడదు. నియోగములందు వీరి యధికార కర్తృత్వమును స్థాపించుట కష్టతరము. వారు నియోగ్యుని (candidate) సభ్యతాది గుణసాంప్రదాయములను బరిశీలింపజాలరు. కాని విధవలు మరికొందరు పుణ్యస్త్రీలును, పారసత్యాది జాతీయ ధర్మముల ననుసరించి కొన్నిసమయములం దాస్తిసంక్రమముల పాలన మొనర్చుచున్నారు. కొందరు స్త్రీలు కుటుంబపోషకులుగా నున్నారు. మరికొందరు రాజ్యాధికారములబొంది గ్రామముల నేలుచున్నారు. వీరికి నియోజనాధికారము లేకుండుట న్యాయ విరుద్ధము. కనుక కుటుంబరక్షకులు (గార్డియనులు), గ్రామాధికార్లునగు స్త్రీవర్గములను నియోగాధికారమును సార్థకముగా జేసికొననిచ్చుట ముఖ్యము. అయినను సాంఘికపాలనమందు స్త్రీవర్గమునకు దగినంత యవకాశము గలుగుటలేదు. గనుక మరియొక పూర్వోపాయమును నియమింతము. నియోగులలో (electors) ననేకులు పురుషులే. స్త్రీలు నియోగ్యులుగా నుండవచ్చును, నియోగ్యు లెన్నుకొనబడవచ్చును,

ఎన్నుకొనఁబడకపోవచ్చును. నియోగులగు పురుషులు వ్యక్తి వంతులుగదా? తమ కిష్టమువచ్చినయెడల నియోగ్యులగు స్త్రీలకు వారిసందేశము (Votes) నొసగవచ్చును. ఇట్టిసతి యుండినచో పురుషుల స్వతంత్రమును స్త్రీలబుద్ధిశక్తులును గూడ పూర్ణావకాశత గాంచును. సామాన్యపురుషులకు మించిన బుద్ధిశక్తులుగల స్త్రీరత్నములను జూచుచుండుట లేదా? మన కాలమందునూ కొందరు నారీమణులు గ్రంథకర్తలుగను ఉప న్యాసకులుగను గొప్పకీర్తుల గాంచిరి. ఇట్టివారందరు నియో గులుగ నుండునట్టి చట్టముల గావించుటదుర్లభము కనుక వీరు నియోగ్యులుగ నుండినచో నీలోపము మాసిపోవును. ఇట్టి కీర్తిగణ్యులును ఆస్తిస్వామినులును నగు కొందరు నాయకీమ ణులు రాజసభల నలంకరించగలిగినచో బాగుండును. ఇట్లు మహాగుణనిధులుగ ఘనతనొందిన స్త్రీ పురుషులచే వెలుగు చుండు నదస్యవిభవము మానవార్థముల నెక్కువశక్తియుక్తు లతో నవర్థింపగలదు ఇట్టిసభ వెనుకటి ఇంద్రసభలతో బో ల్పదగును. పిల్లలు చిన్నవయస్కులు (minors) నియోగము లందు జోక్యము గలుగజేసికొనుటకు దగినంత వ్యక్తివంతులు గారు. ఇంతేకాక వారు నియోగ్యులగుణములను బరిశీలింప జాలరు మరియు వీరియందు స్త్రీస్వామ్యము, కార్యనిర్వాహ కము మొదలగు స్వతంత్రవ్యాప్తులుండవు. వీరిరక్షణము వీరి పోషకుల విధియగుచున్నది. వారిపోషకులు వారి క్షేమమును గోరుచుందురు.

ఇక నియోగుల వివేక ప్రమాణముల విచారింతము. స్వాతంత్ర్య ప్రభుత్వములను దీర్ఘకాలమునుండి బొందియున్న



దేశమంతటను కళాభవనములను, విద్యాలయములను శాఖోపశాఖములుగా వ్యాపింపజేసికొని ధర్మ విద్యల సంఘమంతటను వెదజల్లిన పశ్చిమదేశీయులందరు లిపిజ్ఞులగుటచే వారు స్వపరిపాలన కర్తలనియును మనదేశీయులు విద్యాహీనులనియు, వస్త్రచ్ఛత్ర వాహనాది నాగరకచిహ్నములందు గ్రామాలంకృతులు గారనియు, నందుచే మనవారు స్వపరిపాలనమునకు దగరనియు, స్వలాభాశ్రితులనియు, మన సతిసోదరులగు నాంగ్లేయులు సమయము వచ్చినపుడెల్ల చాటుచున్నారు. లిపిజ్ఞత్వము విద్యలకును, లావుపొడవులు శరీరబలమునకును, అభిద్యపరిమాణములు గావు. అక్షరములు మనోభావములకు సాంకేతిక లక్షణములు. భాషచింతనమునకు రూపాంతరచక్రమము. భాషాలక్షణములను లిపిసారములను దెలిసికొనని వారు మూర్ఖులనుట విపరీతవాదము. చిత్రపటముల వ్రాయనివారును, శిల్పములను చెక్కువారును, ప్రతిమల యొక్క యంగచలనముల దెలిసికొనజాలరనుట పైవాదమునకు సరిపోవును. ఇంతటి విరుద్ధవాదము నెచ్చటను వినజాలము. ఇది మనుష్యానుభవమున కంతకు విరుద్ధము లిపిజ్ఞత్వము లేకున్నను మనదేశీయ జనసామాన్యులు పరదేశీయులకంటె నెక్కువ యనుభవజ్ఞులనియు, వారు మనజాతివారివంటి బుద్ధిసూక్ష్మమును జూపట్టరనియు, బహుదేశములకు పోయివచ్చిన మనవారందరు నొక్కి వక్కాణించుచున్నారు. మనవస్త్రాదియలంకరణ లోపములు మన శీతోష్ణస్థితుల ననుసరించియున్నవని జనవిదితము. మనదేశము యుష్ణ భూభాగమగుటచే వారివలె నిండుదుస్తుల వేయనోపము. వారికంటె మనమెక్కు

డుబీదలము గనుక స్వల్పవస్త్రముల ధరించుచుంటిమి. వర్ణా(రంగు)ది రూపభేదములు నైసర్గికములు గనుక తుచ్ఛప్రమాణములు. శ్వేతవర్ణము నీతిగుణములకు ముఖ్యముగా నేరదు. పరదేశములందుండు సామాన్యజను లందరును గుణనిధులనియు, జ్ఞానధీరులనియు, మనవారు పలుకుటకును నీతిశూన్యులని వారనుటకును జాతీయపక్షపాతము ముఖ్యకారణము. పాశ్చాత్యులు శ్వేతరూపులును అలంకారప్రాజ్యులును, కాంతిపూరితులును, అనుట సామాన్యము. వారు మూఁడు లోకములందు ససమాన పరస్వాపహారులని ప్రసిద్ధిగాంచిరనుట అతిశయోక్తి కాదు.



# పదునొకొండవ ప్రకరణము

## సాధనవిధానము.

స్వారాజ్య సామ్రాజ్య సంపద్వైభవంబులు భారతీయుల కెటు సంప్రాప్తంబగునో ఈ ప్రాచీన పుణ్యజాతి సమీకరణంబునొంది సర్వస్వతంత్రమై నాడు కాంచి శోభిల్లునో యని విచారించువా రనేకులున్నారు. కాని కోరినమాత్రమున కోర్కెలీడేరునా? అనుష్ఠింపబడని యాదర్శములు సమకూరునా? శ్రద్ధాభక్తియుక్తములగు ధ్యానానుష్ఠానములచేగదా పురుషుండు ముక్తిగాంచదగును? అట్టిస్థితిలో త్రింశత్కోటి ప్రజానియగు భారతజాతి కింతయు కృషిలేకయే ముక్తి యలవడుటెట్లగును. మనవారికి కోరికలుగొప్ప క్రియలుకొద్ది. స్వరాజ్యముకొరకితర దేశీయ సోదరులయెడ నవ్యాజకప్రేమను జూపట్టుచుంటిమి. మనవారి దారిద్ర్యదిగంబరత్వము వారి యసూయతను బలపర్చుచుండెను. సంఘీభావములను మనవారియందు వికసింపజేయకుంటిమి. పాలితులు సంఘీభవించినయెడ రాజ్యాధిపత్యము పోవునని తలంచి పరరాజులు ఐకమత్యము ననేకవిధముల నడచుచువచ్చిరి. కవీశ్వరులు గ్రంథకర్తలును రాజుల పరాక్రమ సంపదలను వైభవమును వర్ణించుచు వచ్చిరిగాని జాత్యాభిమానమెచ్చుటను పురికొల్పరైరి. ప్రేరణలేక మనపూర్వులందు జూడదగు జాత్యాభిమానపూరితగుణము లంతరించెను. కాని గడచిన నాల్గేండ్లలో నద్భుతప్రేరణ లుదయించెను. అనివార్యంబగు ధీరగుణంబులు మేల్కొలుపబడెను. రాజకీయసాం

షికార్గములం దుత్కృష్టాదర్శములఁ గాంచితిమి మనవారిపుడు జూపట్టు స్వార్థత్యాగము మానవచరిత్రయందపదృశము. మన దేశభక్తుల నిరుపమానాభినివేశములు శీకరాకారములఁదాల్చి ఫరంగిరాజుల యనంత శక్తియుక్తుల భగ్నము సేయుచున్నవి. జ్ఞానధనుల పరాక్రమ విక్రమ క్రీడావినోదంబుల నెన్నియో జూడనున్నాము గదా! ఏజాతులవారెంతటి యద్భుత చరిత్యాగముల జేసిరో ఎంతటి ఘోరశిక్షల బూని తమ మహదోద్యమమును నేరవేర్చుకొనియుండిరో చరిత్రల జదివి తెలిసికొనదగు. ఆత్మీయశక్తి యుద్యమములకెల్ల నాధిభూతము. ఆత్మీయశక్తి విజృంభించినగాని ఉత్తమమానవార్గములు సాధింపబడనొప్పవు. ఆత్మీయశక్తి యనివార్యము. ఆత్మీయశక్తి యప్రతిహతము. మనుజులసంఖ్యలను బట్టి వారిశక్తు లేర్పడుటలేదు. శ్రద్ధాశిక్షలవల్ల నెంతటి శక్తులనైనను సాధింపవచ్చును. ఆదర్శములు పత్యస్థములుగా. మాత్రమే యుండినచో స్వర్థములే రాజ్యములను రాజులను ధర్మముల కుపశాయములు. భారత జాతి శాశ్వత దాస్యసాగరమున మునిగియుండదు. మనదేశమందు పుట్టుచు గిట్టుచువచ్చినన్ని రాజ్యములు మరియేదేశమునను బొడగట్టుటలేదు. భారతజాతి ధర్మజాతి భారతజాతెన్నడును నిరంకుశప్రభువుల వశముగాజాలదు మన పుణ్యజాతి యీధర్మము నోర్వనొప్పదు. ధర్మవర్తనులు కానిరాజవర్గంబులనెల్ల రాక్షసులని మనవారి మతము. రాక్షససంహారమే మనవారిపుణ్యవినోదము. ఇట్టి ధర్మవిహారములందు పరాక్రమ విక్రమంబులజూపిన బలరామాది మహాపురుషచయముల ప్రజ్ఞాప్రభావంబుల పురాణాది వీరచారిత్రికథనముల పూర్వకముగ

కొనియాడి నిత్యజీవమొసగి వారి నవతారదైవములని పూజించుచున్నారు. సాంఘిక వ్యాదాయాంతగసీమలందు దాగి యుండునట్టిపుణ్యావేశముల పరరాజు లప్పుడప్పుడు తమదౌష్ట్యదేశికములచే మేల్కొలుపుచుండిరి. తురుష్కుల కాలమందు కృష్ణదేవరాయలు, శివాజి, గురునానకుమొదలగుపుణ్యధీరు లుత్తమధర్మావేశ తంత్రివాదనములచే జనసంఘంబుల జాతీయ నిరోధములకు పురికొల్పి రాజ్యముల స్థాపించి న్యాయతంత్రిణముల నొనర్చుచుండిరి. ఇట్టి ధర్మావేశభరితులగు భారతీయులు మరియొక పుణ్యపరిశీలనమున కేకీభవింపక పరరాజులకును పరధర్మములకును శాశ్వతదాస్య లగుదురనుట విశ్వసనీయము కాదు. మన జాతికి స్వతంత్రమునం దత్యద్భుతయభిమానముకలదు. అందువలననే మన దేశమునందు పాలించినరాజులు రాజ్యములును సముద్రతరంగముల పరంపరల పగిది ననంతములై ధర్మాభిమానమును దరిం దగిలి అధోగతులగుచుండెను. మనపురాతనపాలనలందు రాజులు దేశముల నుపద్రవములనుండి కాపాడుటయే వానిముఖ్యభాగము. పాలనాధికారమంతయు స్థానికనాయకులందును గ్రామాధికారులందును పంచాయతీ సంఘములందును వరుసక్రమమున నుచితముగా వ్యాపించియుండుటకు ముఖ్యకారణము మన పూర్వుల నసమాన స్వతంత్రాభిమానమే. మననాటివలె వెనుక పాలనాధికార మంతయు నేకాగ్రమునకు దెచ్చియుండలేదు. ఏక ఛత్రాధిపత్యమున క్రింద నార్యావర్తమంతయు నున్న రోజులలో కూడ అధిరాజులు తమయధికారము నింత గ్రామాంతరములం దంతగా వ్యాపింపజేసి యుండలేదు. ఈ



విషయమ గ్రంథాంతమం దెక్కువగా వివరింపబడినది. ఇంత స్వతంత్ర చింతనముగల మనవారు తురుష్కుల పాలగుటకు కారణములు గలవు. వెనుకటి యుగములందు వర్ణాశ్రమాది వివిధధర్మపథసోపాన నిర్ణయములచే సంఘమునందు సాంగోపాంగము గావించి ఆచారానుష్ఠానముల ప్రతిష్ఠ చేయుచూ వచ్చిరి. కాని కలియుగమునందు బ్రాహ్మణులు సంఘము వారిమీద అమితాధికారమును చలాయింపసాగిరి. పూర్వ యుగములందలివారి యోగ్యతలు లేకున్నను తాము భూసురలనియు దైవముఖమునుండి సృష్టింపబడియును ప్రతిపాదించి కుటిల సాంకేతిక నియమములచే దమను బూజించుటయే క్రిందికులములకు పరమధర్మమని జెప్పి నమ్మించి తమ జ్ఞాన శక్తులను తమ హృదయకమలములందు నేకాగ్రమునకు దెచ్చి గూఢపరచి శిష్టాస్మృతులందుకూడ న్యాయభంగకరముగు న్యూనాధిక్యతల నేర్పరచి గరిమనును గుత్తచేసిరోయన నొప్పుచుండిరి. సంఘాంతరములం దిట్టి ధర్మవైకల్యములచే జనుల మనములందు వైమనస్యమును బుట్టించు దృష్టిస్పర్శ భేదములను కుప్పతిప్పలుగ కల్పించి సంఘీభావమును నాశనము చేయుటయే గాక పురాణాంతములందు జెప్పబడినటుల వర్ణాశ్రమములకు భంగమువచ్చునని బోధించి క్రమముగా వాని పేరట తమ దురాచారములనే బలపరచుచుండిరి. ఇందువల్ల నంతకంతకు విద్యాప్రజ్ఞలు విప్రులందె సంకేతమై వైదికులం దెచ్చుటనో గూఢముగా దాగియున్న విద్యాప్రజ్ఞల శక్తులు జనసామాన్యములకు వ్యాపింపకుండెను. జనసామాన్యములు విద్యాంధకారమున మునిగిపోయిరి. ప్రజ్ఞాగుణముల సన్మా

నించుటకు దగు సామర్థ్యములు సంఘమునం... లేకుండెను. ప్రజాసన్మానము లేనిదే విద్యాప్రజ్ఞ లెట్లు శాశ్వతమగును? క్రిందిజాతులు లెక్కకు మించియుండిరి. మొదటిజాతివారు కొద్దిమంది. వీరు పేదలు. వీరిగుణములు సంఘాంతరములందు ప్రతిబింబించి యుండనందున తమ విపరీతములను తామే జీర్ణము చేసికొనవలసి వచ్చెను. తమదౌష్ట్యములు తమనే నిరాధారులుగ జేసెను. బ్రాహ్మణవర్గంబులు భిక్షాటనము చేతను జీవించవలసి వచ్చెను. తమ కుక్షింభరత్వమును సాధించుటకు పిచ్చిపిచ్చి నోమువ్రతములను దురాచారములను ప్రచురింపసాగిరి. పురుషసూక్తము నింటింట జదువసాగిరి ఇట్లు వర్ణద్వేషములు సంఘము నందంతటను వ్యాపించి అన్యోన్యతను నాశనము చేసెను. అన్యోన్యతలేని దే జాతియు గొప్ప కార్యముల బూనజాలదు. భారతజాతి పెక్కు అరిష్టములపాలాయెను. ఈ వర్ణభేదములే మనలను రాజ్యభ్రష్టులను జేసినవి. పారస్పరత లేక నొకరి కులవృత్తులం దొకరి కభిమానము లేక వృత్తులు నశించె. విద్యలు నశించుటను క్రిందికులమువారు చూచియూరకుండిరి. క్రిందికులములవారి జీతిపనులు నశించుటను జూచి విప్రులూరకుండిరి. స్వార్థము, ద్రోహము, గర్వము, అసహితమొదలగు వైమనస్యకరమగు గుణములు జాతినంతయు నధోగతిపాలు జేసెను. ఈవైమనస్యమున కంతకు పురుషసూక్తము మాతృకయని దలపనొప్పదు. పూర్వయుగములందు స్వభావమునుబట్టి వర్ణములు నిర్ణయింపబడుచుండెడివి. బ్రాహ్మణులు విశ్వరూపుని ముఖమునుండియు, క్షత్రియులు హస్తములనుండియు, వైశ్యులు తొడలునుండియు, శూద్రులు పాదములనుం

డియు జన్మించిరని చెప్పుటవల్ల నన్ని వర్ణములవారును దైవాంశసంభూతులని సూచించుచున్నది. సంఘ మంతయు నొకశరీరమునకు బోల్పబడెను. ముఖము చేతికం టెక్కువగౌరవనీయమనుట పిచ్చితనము. ఈ వర్ణనియమము యుగములందు క్రమము మారుచూవచ్చినది. భారతకాలమునాటి కులాచారము లిపుడు లేవు. వాల్మీకుల కాలమునాటి కులకట్టడి కృష్ణుని కాలమందు గానరాదు. ఈ దురాచారపిశాచబాధ కోర్వజాలక మన క్రిందికులములవా రనేకులు పరమతముల నవలంబించి తమ మర్యాదలను బెంపుచేసికొనుచున్నారు. ఇందువల్ల నిపుడు ప్రతిసంవత్సరము వేలకొలదిజనులు పరమతముల పాలగుచున్నారు. హిందువుల సంఖ్య క్రమముగా తగ్గిపోవుచున్నది. కులకట్టడికి ప్రాణము సాంప్రదాయము. వృత్తులాదిమసంఘములందు సాంప్రదాయముచేతనే పెంపొందును. జాతులు విస్తరించి పారిశ్రామికవృత్తులందు నాగరకతజెందినకొలది జాతియందు విద్యలు వ్యాపించినకొలది కులకట్టడివలన గలుగు సాంప్రదాయము లేకుండనే తమతమ నిజగుణములచే మనుజులు పారిశ్రామిక గరిమమును బడయుచున్నారు. జాతి మితమయి పాలనమార్గములు నాగరకతనొందక, పన్నులు క్రమముగా నియమింపబడవు. ఆదాయవ్యయములును క్రమముగ నుండక పాలనాంగములు వివిధతజెందక వేతనములతో సైనికుల నియమించుకొనని ఆదిమజాతులం దట్టికులకట్టడి ఉపయోగకరముగ నుండవచ్చును. కాలానుసారముగ వాడుకలు, ఆచారములు, అభిప్రాయములు, అభ్యాసములు, అవసరములును వేరగుచున్నవి. ఒక కాలమునాటి ఆచార

ములును వివరించి వ్రాయుటయే స్మృతి. ఇటుల మనకనేక స్మృతులుకలవు. స్మృతికర్తలు ఆచారముల నియమించుటలేదు. వారికాలమందలి ఆచారానుష్ఠానములను వారు వివరణములుగా జేయుదురు. కవి రసములను కల్పించుటలేదు. చిత్రకారులు శూరులను నియమించుటలేదు. శిల్పి దేవాలయమును గట్టవచ్చును. కాని దైవభక్తి మానవజాతియందిమిడియున్నది. స్మృతికర్తలు ఆచారములను కల్పించినయెడ మానవజాతి వాటిని విశ్వసింపదు. జనసామాన్యములే మానసికకాలమునందు సాంఘికపరిభ్రమణమునకోర్వరు. మానవజాతి మానసిక ప్రావరణముల సహింపనోపదు. విశ్వము మనోమయము. మనసు వ్యక్తులందు స్థానికమగుచున్నది. సామాన్య జనులందు స్వప్నావస్థ నెందియుండును. ప్రాజ్ఞులందు జాగరూకత నొందియుండును జ్ఞానులు భావికావస్థల దెలిసికొని జనసామాన్యములకు తమ యాదర్శములను బోధింతురు. వారిబోధనలు నెమ్మదిగా సాంఘికగర్భమందు జీర్ణించును. ఒకరొక మార్పునుజేయును. దానినే మరికొందరు చేయుదురు. ఇట్లు క్రమముగా నాచారములు పుట్టుచున్నవి. ఆచారము జలపాత్రన్యాయమున మానసికవృత్తుల కనురూపముల దాల్చియుండును. మనసు మన శరీరమువలెనే క్రమముగా ప్రబలమగును. లోకమునందు స్థిరత్వము లేదు. చలనము విశ్వమునకు లక్షణము. ప్రతినిమిషమును ప్రతివస్తువును ప్రకృతియును మార్పుజెందుచున్నవి. ఈమార్పులు మనజీవనమందు మగ్నములై ముందంకురింపబోవు అనుభవములకు బీజములుగానుండును. కాలచక్రమిట్లు తిరుగుచు వ్యక్తులను జాతులను భ్రమణముల

పాలు చేయుచుండును. ఈభ్రమణముల చే మానవశక్తి చిం తనలకు పారిశ్రమికావకాశత కలుగుచున్నది.

మనదేశమందలి పంచమాదులు 5 కోట్ల 30 లక్షల సంఖ్యగలిగియున్నారు. మనగర్వమున వారిని హీనజాతులని పిలుచుచుందుము. ఈనదేశమందు వీరిని మాలలని యు మాదిగ లనియు బిలుచుచున్నారు. దక్షిణమున పెరయలు, మాంగు లు, వీరికి పేళ్ళు. సింహళప్రాంతముల పల్లెవాళ్లని పిలువబడు చున్నారు. వంగదేశమున నామశూద్రులనియు, తియార్లనియు పిలువబడుదురు. మనజాతివారు పంచమాదులకు జేయునక్ర మము అన్యాయము ప్రపంచ దేశచరిత్రలందు నిరుపమాన ము. వారు గ్రామములలోకి విచ్చలవిడిగా రాజాలరు. వారు ధనికులైనను విద్యలనభ్యసించి అధికారులైనను భూసురులు చూచి సహింపజాలరు. ద్విజులకు మిక్కిలి దూరముగానిల్చి మాట్లాడవలయును. వారిని సామాన్యముగా గడ్డలతోను చెప్పులతోను గొట్టి పనుల నెరవేర్చుకొనవచ్చును. కొందరికి వారు కంటబడుటయే పాపకర్మము. ఇంత వంచనను వారు సహింపలేక పరమతముల సమబుద్ధికిని సహిష్ణుతకును శరణు జొచ్చుచున్నారు. ఏ రీస్థితిలో నున్నంతవరకు పాశ్చాత్యుల యెదుట మనము నాగరకులమని చెప్పుటకు సిగ్గగుచున్నది. ఇట్టి వైమనస్యకరమగు సంతర్ వ్యవస్థల దెలిసికొని తురుష్కప్ర భువులు కపటధర్మాభిలాషులై క్రిందికులములవారి నెక్కువగా జేపట్టనారంభించిరి. వీరిప్రభుత్వము కేవలము ధర్మవిరుద్ధమనుట కల్ల. వీరు యుద్ధసమయములందు దండెత్తివచ్చిన దేశములను దోచి సైన్యముల కర్పించుచు వచ్చిరికాని. వారి పాలనక్రిందనుం

మీ రాజ్యములను ప్రజాపీడనము లేకుండగనే చక్కగ పాలన సలుపుచుండిరనియు క్రిందికులములవారు తురకరాజులవల్ల కలుగు సంకటము లానాటి హిందూరాజుల దౌర్జన్యమునకు మించియుండనందున తురకలు కొంతకాలమైనను శాంతముగా నేలగలిగిరి. ప్రజలను ఖడ్గబలముచే నేలజాలక దేశరాజుల తో వియ్యముబొందుట దేశీయులకు హితమగు ధర్మకార్యము లనుగూడ చేయుచు వారి యనురాగమును బొందబూనిరి. ఎన్ని చేసినను వారి నైజగుణముల నణపలేకుండిరి. పరరాజులు ఆస్తిస్వామ్యమును ప్రాణరక్షణమును భంగపుచ్చినపు డెల్ల తిరగబాటు చేయుచువచ్చిరి. మహమ్మదీయ పాలన కాలమందు రాష్ట్రములు బహుతరచుగా తిరగబడుచుండె డివి తురుష్కులపాలన మనజాతియందలి అంతఃకలహములచే పోషింపబడుచుండెను. రంగమునం దెదురించుచు వచ్చినది తరచుగా పైకులమువారె! ఆనాడు రాజుమాత్రమే దేశాభిమాని. రాజునురంగమునం దోడించినమాత్రమునఅనోన్యత కలిగి సంక్షోభవించినచో రాజ్యము పరవశమగునా? రాజు నోడించి కోటనుబట్టుకొని మంత్రులను గ్రహించి కోటబురుజులందు తమ ధ్వజముల నాటినంత మాత్రమున నే రాజ్యమైన పరాధీనమగునా? ప్రజాభిమాన మున్నచోట నెల్ల మనరాజులు జయించుచువచ్చిరి. ప్రజాభిమానము లేని రాజు లపజయముల పాలగుచువచ్చిరి. దేశమంతయు సంక్షోభవించినకూడ గ్రామములును పట్టణములును వశపడుట సులభమా? నిజముగా భారతీయులెన్నడును పరవశముగాలేము. మనజాతి అజేయము. భారతజీవమనంతము.



భారతి వయోపారియముల నతిక్రమించిన నిత్యకన్య. ఆత్మ
కలవరముచే నిద్రజెందియుండ సాప్తికముగ నపజయమొంద
నని యందుమా? కాదు. భారతజాతి కాలధర్మముల నతిక్ర
మించుచున్నది. ఈజాతి క్షీణదశ నుండలేదు. దైవాజ్ఞచే
నుత్తమజాతికి యుచితమగు జీవయాత్రయం దెప్పుడు నెడతె
గక గమ్యస్థానమునకై పోవుచున్నది. నివాసయోగ్యమగు
దేశము గానక దేశాటనముచేయు పరజాతులకు భరతవర్షము
శరణాలయ మాయెను. దీనులగు పారసీకులను కాపాడి పెద్ద
సంఘముగా జేసెను. గడచిన ఇరువది శతాబ్దములందే భారత
జీవము విస్తరించి విశ్వమయ మయ్యెను. ద్వీప ద్వీపాంతరములం
దెచ్చటజూచినను భారజాతియొక్క కీర్తిధ్వజములో యనద
గునటుల పురాతనాలయములును, శాసనములును గనిపించు
చున్నది. ఇదంతయు భారతీయుల పతితయుగమని చెప్పబడు
గడచినఇరువది శతాబ్దములలో జరిగియున్నది. సింహళము
బార్నియో మొదలగు ద్వీపములందును, అమెరికా ఖండమం
దును మన విశ్వమానవజీవము నివి జూపట్టుచున్నవి. అజ్ఞాను
లీ యుగమును నిందింతురు. ఇయ్యుగమునందే భరతఖండ
మంతయు వివిధజాతుల సమూహముతో నింపబడెను. ఇప్పుడీ
భారతజాతి విశాల విశ్వమానవజాతికి ప్రతినిధిసభయో యన
దగునటుల విస్తరించినది. ఈ యుగమునందే భరతదేశము
నూరుభాషలతో శోభిల్లుచున్నది. నూరు భాషలతో భారత
సంతానము లయ్యేలలో నూగుచు జోలగానముల నానం
దించుచున్నారు. ఇప్పటిత యుగమందునే మన దేశభాషలుపుట్టి
విస్తరించి శోభిల్లెను. వెనుకటి యుగములందలి యుత్తమధర్మ

ములు అనేక దర్శనములచే వ్యాపించెను. మనము కల్పించిన చేతిపనులు విద్యలు విజ్ఞానవ పరిశ్రామిక ప్రదర్శనశాలాగారమో యనదగు. మన భాషా కల్పనములు చరిత్రలందు నిరుపమానములు. ఈ యుగమునందే మన ధర్మములు బహువిధ పథసోపాన శోభిత దివ్యసౌధమో యనదగునట్టుల నారోపించబడును. ఇయ్యుగంబున భారతి కీర్తిగాంచిన విక్రమాదిత్యాది వీరమహాశయుల నరసి పరాక్రమ ప్రభావతియో యననొప్పె భావికావస్థా వైభవజ్ఞులకు మన పతితయుగమునందు భారతసంతానము భావిక మహౌదార్యమమునకు వలయుసకల వస్తు సమాగమ సన్నాహంబుల జేయుచుండిరి.

పరతంత్రములపా లయితిమనుటకల్ల. పరతంత్రములు తమనిజశక్తులతో రాజ్యభారము మోయజాలక ప్రజాభిప్రాయము ననుసరించి పోవలయునని తురకరాజులు దేశీయుల బుద్ధిశక్తుల కనకాశత యొసగుచు తమయాధిపత్యము క్రింద స్థానికపాలకులచేతను పంచాయతీలచేతను దేశీయులు తమపాలన తామే చేసికొనునట్లు నియమించుచుండిరి. మహమ్మదీయ ప్రభుత్వము మనయందొక సంస్కరణమును గావించెను. పాలితులందరు సమానులను సిద్ధాంతము తురుష్కులు నేర్పిరి. ఇట్లు రాజకీయ విషయములందు సర్వజనులు సమానులైరి. కానిదీనియం దొకవిశేషముకలదు. మనజాతి యొక్క వివిధపక్షములవారిని సమముగా పాలించిరని చెప్పినపుడు అధికారలేమియందును రక్షణశిక్షలందును మాత్రమే సమత్వమన్వయించును. అధికారకర్తృత్వము పరరాజులందేయుండెను. కాని పాలనపద్ధతులు మన జాతీయభావముల కనురూపము

లుగా నుండుచువచ్చెను. అట్లు కానిసమయములందు ప్రజలు తిరగబాట్లుచేసి విప్లవముల గావించుచువచ్చిరి. పరరాజుల పాలనమున మరియొక విశేషమున్నది. ఆదిమజాతులందు రాజకీయసాంఘికగత విషయములన్నియు రాజులచే పాలింపబడుచుండెడివి జాతీయ యావశ్యకములను వాటియన్యోన్య గుణములచేవేరుపరచి వాటిపాలనమును నన్యథాకరించుట యే నాగరకతకు లక్షణము. పూర్వము మనదేశమందు రాజులే మతసంస్కర్తలుగనుండిరి. ఇటుల జాతీయ జీవితపాలనాధికారమంతయు నేకస్థానికము గాకుండుట మనకు ముందు ముందు లాభకరము.

ఆంగ్లేయపాలనక్రింద మనదేశములోని క్రిందిజాతులు స్త్రీలు మొదలగు పతిత జనవర్గంబులు తలయెత్తి చిగుర్చుచున్నవి. వీరి పాలనక్రిందనే సాంఘికారోహణము దినదిన ప్రవర్ధమానంబగుచుండెను వీరి సంపర్కమువలననే మనమితర దేశములకు సిరిసంపదలొసగిన కారణమును దెలిసికొనగలిగితిమి. బుద్ధునికాలమునుండియు మనదేశమందు సంఘ సంస్కర్తలనేకులు సాంఘిక ఆధ్యాత్మిక సర్వస్వమును సాధింపబ్రయత్నించిరి. కాని వారి యుద్యమములు కొనసాగకపోయెను. విద్యావిహీనులును వైమనస్కులును భేదబుద్ధిభరితులును వస్తుకాంతా పూరితులునగు ఆధునిక హిందువులందు బౌద్ధుని సాంఘికసర్వస్వమును శంకరశాయనాదుల ఆత్మీయ సర్వస్వమును ఐహికార్థములతో సంగమించియుండనందున సంఘీభావమును ఐకమత్యతను పురికొలుపలేక పోయెను. రామానుజుల నాటినుండియు ననేకసంఘసంస్కర్తలు వైమనస్య

కరమగు సాంఘికన్యూనాధిక్యతలను నాపివేయబూనినను సంఘాభివృద్ధి కనుదాయకమగు ఉత్తమరాజ్యాంగమెద్దియు వారి సంస్కరణములకు తోడ్పడకయున్నందున వారియభీష్టములు కొనసాగకుండెను. అంతరాష్ట్రవస్థ సంసర్గముల చేతను కేవలస్త్రీభావప్రేరణల చేతను సంఘమునందున్న క్షుద్రవైకల్యములను రూపుమాపివేయుటకు భారతజాతి గడచినపదిశతాబ్దముల నుండి చేయుచున్న ప్రయత్నములన్నియు నిష్ఫలములాయెను. భారతజాతి తనయఖండ సర్వస్వమును పరశక్తులతోను పరతంత్రములతోను సాధింపనగునేమోయని వెనుకతురుష్కులను ఇప్పుడాంగ్లేయులను సర్వసమతనుజూపు పాలననొసగుమని నిరంతరముగా వేడుచువచ్చెను. ఆనాడు అగ్బరుచక్రవర్తియు మననాడు విక్టోరియా మహారాణియును కూడ నీమహాసంకల్పములనుబూని అంతర్వి విప్లవములను గల్పించినయెడ తమ పాలనాధికారమునకు ముప్పువాటిల్లునని తలచి తమ మనోరథముల విడనాడి సాంఘిక మతవిషయములం దేజోక్యమును గల్పించుకొనక జాతి సముదాయమును నిశ్చలతనుంచినగాని తమకు శాంతి కలుగదని నిశ్చయించుకొనిరి. ఇట్టి నిశ్చలత తాత్కాలిక సంపదల నిచ్చినట్లు కనుపించినను క్రమముగా జాతిని మృత్యుదేవత కొసగునని దైవానుగ్రహముచే తెలిసికొంటిమి.

పరతంత్రములను పరశక్తులను మన మపేక్షింపకూడదు. ఆంగ్లేయులు మన కిచ్చెద మను స్వరాజ్యము మనలకు కొంత కాల ముపశాంతి నిచ్చునేమోకాని మన సాంఘిక సమస్యను సమర్థింపజాలదు. పరరాజు లేలునంతవరకు ప్రతిజాతికి ప్రతి

మనుజునకు తన అభీష్టముల నెరవేర్చుకొనుటకు స్వతంత్ర స్వా
క్తుల వ్యాపకము నాటంకపరచును. ఉపమించి చెప్పెదను.
బ్రాహ్మణులుదప్ప తదితరులు ఆ దేవాలయములలోకి బోయి తమ
శాస్త్రములతో తమదేవుని పూజించుకొనుహక్కు వారి కేనా
టికి కలుగును? నీతివాదములచే బ్రాహ్మణులు తమ సర్వస్వా
మ్యమును త్యజింతురా? వారి కిష్టములేదే క్రిందిజాతులవా
రాలయములలోకి పోయినయెడ పోలీసువా రూరకుండె
దరా? వెనుకటి సాంప్రదాయము నిప్పటి విప్రులందు జూచు
చుంటిమా? వెనుకటివారివలె నిప్పటి శూద్రులు విద్యా
విహీనులుగను నీచదాస్యులుగను కనుపించుచున్నారా?
లేనిచో వారిగుణముల కనుగుణ్యమగునట్టి యవస్థల నెందు
కొసగగూడదు? ద్విజులలోనే కొందరాలయముల జొరబడి
పూజలు సేయబూనినందుకు శిక్షల నెన్నిసార్లు వేసియుండిరో
యెరుగమా? సేలము, మధుర జిల్లాలలో నెన్ని యల్లకల్లోల
ములు జరిగియున్నవో మన మెరుగమా? విప్రకల్పితములగు
నీచభేదములను దురాచారములను రక్షించుచు, సాంఘిక
వైకల్యములను పీఠముగా జేసికొనియుండు పరంగీయులు
తమ రహస్యము శూద్రు లెరింగిపోదురేమోయని బ్రాహ్మ
ణులను సమయమువచ్చినపుడెల్ల నిందించుచు ఇతర జాతుల
వారిని బుజ్జగించుచు తురుష్కులవలెనే వీరును కాలము
గడపుచున్నారు. గుణములను నిజశక్తి ప్రజ్ఞలను ప్రమాణ
ముగా జేసి సంఘమును తిరిగి సమకూర్పవలయును. కొన్ని
విక్రమ విహారములకును యుక్తిశక్తియుక్తమగు ఆంతర్య
విరోధమార్గములకును అవకాశత నిచ్చుటకు రాజకీయబంధము

లనుకొంచెముసడల్చిన యెడ సాంఘికారోహణము పూర్ణముగా సిద్ధించును. కాని పరరాజు లిట్టియవకాశత నివ్వజాలరు. సాంఘిక వైకల్యముచే మనజాతివారి వశమైయున్నది. ఈవైకల్యములకు సాంఘికనిశ్చేష్టత ప్రాణమైయున్నది. మొగలాయిల పాలనాంతమందు యూఘులు అరాజకమనిచెప్పు మహాదయ కాలమందు క్రిందిజాతులవారు తమశక్తియుక్తులచే భూస్వాములుగా మారిపోవుచుండిరి. మనదేశమందు ఆంగ్లేయులుజప్తుచేసి తీసికొనగా మిగిలిన ఆధునికస్వతంత్రరాజులును జమీందారులును క్రిందిజాతులవారే. మొగలాయీ ఆంగ్లేయులపాలనల సంధికాలమందు క్రిందిజాతులవా రాపదవిని సాధించియున్నారు. సర్వజాతిసమేతంబైన శక్తియె శాశ్వతరాజ్యము నొసగునని మహారాష్ట్రులు దలచి తమసైన్యములందును పాలనయందును క్రిందిజాతులను జేర్చుకొనుచువచ్చిరి. కాని వారి దోపిడి మొదలగు ధర్మవిప్లవములు జనసామాన్యముల నమ్మకమును భంగపుచ్చెను. ఇందువలన మనజాతియంతయు మహారాష్ట్రులవశము కాలేదు. ఇందువలననే భారతజాతి ఆంగ్లేయుల పాలన నంగీకరించవలసివచ్చినది. పరరాజులు మనధనమునుధనసాధనముల నపహరించి రందురుకాని మన ధనసాధనములనంతేయు ద్రౌపదీవలువలవలె విప్పినకొలది పెరుగుచుండును. ఎంతటి దరిద్రముననున్నను స్వపరిపాలన సిద్ధించినచో మనధనసాధనములను వెంటనే క్రమపరచి పెంపొందజేయగలుగుదుము. సకలజాతులు వృద్ధిజెందుటకును మనజాతి వెనుకటికీర్తిప్రజ్ఞల నడసి జగద్గురువై పరదేశములకు ఖడ్గబలముచే పశుప్రాయులగు పాశ్చాత్యులకు తన యాధ్యాత్మికజ్ఞానమును

వ్యాపింపజేయనిచో లోకమంతయు మితిలేని సైన్యములకు కుట్రలకును స్థానమయి భూకాంతమయమయి ఘోరయుద్ధ ప్రళయములచే నొక్కసారిగా నాశనము కావచ్చును. ఇట్టి మహోద్యమము భారతజాతికి ముఖ్యవిధియైయున్నది. మన జాతియంతయు జ్ఞానతేజముతో ప్రకాశించుచుండవలయును. విద్యల విచ్చలవిడిగా మనజాతియందు వ్యాపింపజేయవలయును. జాతీయవిద్యలు, జాతీయధర్మములు, మిక్కిలిగా వ్యాపించవలయును. ఇట్టి అనంతధర్మవిద్యావ్యాప్తి పరరాజుల వల్లను పరతంత్రముల వల్లను బొందజాలము. మరియు దారిద్ర్యము తగ్గిపోయినగాని పేదలగుప్రజాసంఘము వారు విద్యల నభ్యసించుటకుచితయవకాశతను విరామమును గలిగియుండరు. ఆదాయ వ్యయములను మితపరిచి క్రమముగా దేశదారిద్ర్యమునునాశనము చేయుటకును, విద్యల ననంతముగా వ్యాపింపజేసి సాంఘికారోహణము చేయుటకును నానాజాతులలోను మనకు నిజవిధియగుఆధ్యాత్మిక మహోద్యమముచేలోకమును, ధర్మమును పునఃప్రతిష్ఠచేయుటకు సర్వసన్నాహసంయుతంబగుటకును స్వరాజ్య మత్యావశ్యకము. స్వరాజ్యము నేకీభావముచే సాధింపనగు. ఏకీభావమున్నచో మూడుదినములలో భారతీయులు పట్టాభిషక్తులు కాగలరు. ప్రస్తుతము పరరాజులకు పీఠమైయున్న సాంఘిక వైకల్యముల నన్నింటిని రూపుమాపవలయును. బహిష్కారమే ముఖ్యసాధనము. ప్రస్తుత రాజ్యాంగమును విసర్జించి స్వరాజ్యమునకు వలయు అంగసౌష్ఠవమును నియమింపవలయును. ఆంగ్లేయులపాలన మావంతైన దప్పినయెడ మనవారందరు తమలోతాము హత్యలుచేసికొని

జత్తురనియు, ధర్మవిప్లవములు జరుగుననియు కొందరు పిచ్చి భ్రమను గలిగియున్నారు. "కలౌ సంఘేశక్తి" అను మహావాక్యమును మఱవవద్దు. కలియుగమున మానవకోటియందు ఆవియుక్తమగునట్టి శక్తి ప్రతిదేశమందును ప్రతిజాతియందును, వ్యాపించుచున్నది. వాణిజ్యము, యంత్రములు, కర్మాగారములు, తంతిసాధనములు, విద్యుచ్ఛక్తియు, జాతిభావము ప్రబలి మానవజాతినంతయు నైక్యము చేయుచున్నది. ఈనాటి కార్యగమనములు, జాతివ్యక్తుల సిరిసంపదలును పరస్పరతను అన్యోన్యతానురాగములను విస్తరింప జేయుచున్నది. ప్రతిమనుజుడు తనజీవము సాంఘికజీవముతో నెడతెగని పరస్పరతను గలిగియున్నదని నిత్యానుభవమువల్ల దృఢముగా నమ్మింపబడుచున్నాడు. ఆత్మరక్షణమునకును ఆస్తిస్వామ్యమునకును పాలనములేనిదే వీలులేదని నిమిషములో మనుజులు తెలిసికొనగలరు. ఆదిమజాతులు భోజ్యములను నిలువబెట్టుకొనరు. వారిండ్లన్నియు కొంచెమించుమించుగా సమాన విలువగలిగియుండును. వారిండ్లయందుండు సామగ్రి అంతటను నొకటే. వారు సంచితభోజ్యములను గలిగియుండక భావికచింతనమే లేక దినకృత్యములచే జీవనము జరుపుచుందురు. దేశకాంక్షవల్లనో రాజ్యకాంక్షలను పాలనావశ్యకము లేని యిట్టిజనులను స్వాధీనపరచుకొని పరజాతులు పాలన జేయ ప్రారంభించినయెడ దేశీయు లధికారమునకు విధేయత నొసగుట కష్టము. వారు రాజ్యాంగముతో నేవిషయమునందును దోడ్పడరు. నేరస్థులనుకూడ కాపాడుచుందురు. నేరములను రహస్యపరతురు. సత్యమును ధైర్యముతో నిలు

పజాలరు. న్యాయస్థానములకేగి అబద్ధములాడి న్యాయభంగముం జేయుచుందురు. ఇట్టి ఆదిమజాతి నేరముల నరుదుగ జేయును. వారికి వస్తుకాంక్షమితము. వస్తుస్వామ్యముకోరరు. ప్రాణమందు లక్ష్యముతక్కువ. ప్రాణమునుకూడ మిక్కిలి జాగ్రతతో గాపాడుకొనరు. ఓషధాది వస్తుసహాయముచే తమ జీవితకాలమును దీర్ఘము చేయబూనరు. వీరు రాజ్యావశ్యకముల నెరిగియుండరు. వీరి నేలువారు తమ పాలనమును వదలివేసినయెడ వీరు తిరిగి రాజ్యమును స్థాపింపరు. దేశము అరాజకమగును. కాని నాగరకతగల దేశములలో వస్తుస్వామ్యము విస్తరించియుండ సాంఘిక న్యూనాధిక్యతలు పెక్కులైయుండ, ఆస్తులను, ప్రాణములను, గాపాడుటకు ప్రతివారును దమకు చేతనైనంత చేయబూనియుండ వీరి నేలువారు తమ పాలనము వదలుకొనినయెడ సంఘము ధర్మవిప్లవముల పాలగుననుట సాహసము. మానవులగుణముల ననుసరించి వారి సాంఘిక రాజకీయస్థాపనము లేర్పడుచున్నవి. రాజ్యావశ్యకములను గర్భమునందుగల మానవజాతి పాలనను గల్పించదనుట యవివేకము. మనదేశమందు సనాతనధర్మంబులును సంస్కారణంబులును రాజులచే పాలింపబడుచుండెడివి. పరరాజులు దేశమును నేలసాగిరి. దేశీయ రాజులును తమ పాలితుల మత విషయములం దొకింతయు జోక్యము గలుగజేసికొన కుండిరి. అంతట సంఘము స్వశక్తులచే ప్రేరేపింపబడి పీఠములను పీఠాధిపతులను గురుసాంప్రదాయములను కల్పించుకొనెను. ఈనాటికిని మనము కన్నుఁదెఱచి చూచినచో మనజాతి యొక్క మత సాంఘిక స్వపరిపాలన

మును జూడవచ్చును. పరరాజుల బంధములనుండి మన పురాతన పుణ్యజాతి ముక్తిగాంచినచో తన సహజసద్గుణములచే తను, తన సాంఘిక రాజకీయావశ్యకముల కనుగుణ్యమగు పాలనమును వెంటనే నియమించుకొనును. యజ్ఞవాటి, పుణ్యభూమి అని ప్రసిద్ధిగాంచిన యీ భరతదేశము ధర్మవిప్లవములకును దోపిడులకును దౌర్జన్యాది దౌష్ట్యములకును వశమయి భారత సంతతి వెంటనే అంతఃకలహములచే రూపుమాపుకొను నను నంతటి పిచ్చిభ్రమ వేరెద్దియు లేదు. లేదు. లేదు. అంధకారము నశించినది. భారత సంతానము తిరిగి అఖండ స్వరాజ్య సామ్రాజ్య వైభవంబును సాధించి వెల్లువిరిసికొని వచ్చుచున్న ఆధ్యాత్మిక ప్రవాహముచే మానవజాతిని సారవంతముగను లోకమును ధర్మాలయముగను జేయనున్నది. భారతీయులారా! మేల్కొనుడి. క్షామపీడితులగు పామరులారా! స్వరాజ్యమును స్థాపించి సిరిసంపదల వడయుడు. చిరకాలమునుండియు పెక్కు కష్టములపాలయిన హీనజాతులారా! స్వతంత్రమును సాధించి సాంఘిక సర్వసమత్వమును సర్వస్వమును గాంచుడి. దరిద్రులకును పామరులకును క్రిందిజాతులకును మంచి సమయము వేచియున్నది. తప్పవద్దు. ఈ సమయమును విడనాడినచో మీరెప్పటికిని ముక్తిగాంచరు.

---

# సందేహింపవ ప్రకరణము.

## సారాంశము.

మాతే వ్యథా మాచ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోరమీదృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥ —గీత॥ 11—49

సంఘంబులు స్వస్వార్థిత బులు. మనుజులును మనుష్య వర్గంబులునుకూడ తమసంచితవర్తమానకర్మలచేత తమముందుగతులను తామే నియమించుకొనుచున్నారు. మన సంపదలు మన కర్మలబ్ధములు. భరతఖండం బజ్ఞానబంధురంబయినను భరతసంతానంబులు పురుషసూక్త ప్రబోధితంబగు సర్వసౌభ్రాతృభావంబుల మరచి ధర్మభంగకరంబగు న్యూనాధిక్యతల ననేకంబులంగావించి భూరా సౌఖ్యభరితులయినను దండెత్తివచ్చిన దూరదేశాధిపతులకెల్ల నీచదాస్యంబు సేయుచు సర్వస్వంబుల గోల్పోయినను జాతీయసంచిత కర్మఫలంబులని చెప్పనొప్పు. స్వరాజ్యంబు సర్వార్థసిద్ధి కనుదాయకంబు. స్వరాజ్యమును సాధించి సర్వసౌభ్రాతృ ధర్మంబుల ననుసరించి సాంఘికారోహణంబు సల్పి అన్యోన్య ప్రపత్తులచే జాతిసంతయు క్షుద్రవైకల్యంబులనుండి తొలగించి రాజకీయ సర్వస్వంబును బ్రతిష్ఠచేయుటయే స్వసామ్రాజ్యము. ఈ ఆదర్శమును పూర్ణముగా ప్రచురించవలయును బోధకులింటింటికి గ్రామగ్రామమునకు పట్టణపట్టణమునకును బోయి భావికాలావస్థలను గురించియు, ప్రస్తుతావస్థలను గురించియు స్వ

సామ్రాజ్యవైభవంబును గురించియు వివరంబుల జెప్పి జనసంఘముల నొప్పించి నీయుద్యమంబునకు దోడ్పడునట్లు చేసినచో మనజాతికి సహజగుణమగు ధర్మాభిమానము ప్రబలి ప్రవాహమై పరతంత్రము నూడ్చివేయును. స్వార్థత్యాగులు, తదేకనిష్ఠపరులును, ధీరులును, వందలకొలది వెంటనే బయలువెడలి సాత్వికనిరోధాభిలాషను వ్యాపింపజేయవలయును. మన పూర్వధర్మములు, దైవములు, పురాణములు, వీరకథనములు మనసహకారులు. బహిష్కారమే బ్రహ్మాస్త్రము. దీనిని బోధించుటలో ననేకు లాత్మత్యాగము చేయవలయును.

వంగదేశమం దావేశోద్రేకములపాలయిన బాలుర గొందరు ఘాతుకకృత్యములచే పాలకుల నిరోధమును మిక్కిలిగా బురికొల్పిరి. ఘాతుకకృత్యంబులు విశ్వమానవజ్ఞాతిత్వమునకును జాతీయసౌభ్రాత్రతకును హానికరము. మానవజాతియంతయు దేవుని విశ్వరూపమునందు భాగమైయున్నది. ప్రతిమనుజుండును మూర్తీభవించిన దైవంబు. సాత్వికనిరోధమువల్లనే సర్వధర్మములను సాధింపదగు. భూతదయకును సాత్వికవృత్తులకు నాలవాలమయిన మన పుణ్యజాతి ఘాతుకకృత్యములచేతను విద్వేషములచేతను సామ్రాజ్యసంపదల బడసెనని చరిత్రలందు చెప్పబడకుండుట దేశభక్తుల యభిమతము. ఇట్టుల శాంతముగా రాజ్యాంగభ్రమణమును జేయబూనిన జాతీయపక్షమువారికి దొరతనమువారు తోడ్పడుట శ్లాఘనీయము. ఇట్లు జరిగినచో మనపాలకులు చరిత్రలందు శాశ్వతకీర్తిని బడయగలరు. ఇంతటి ఆత్మత్యాగము నాంగ్లేయనాగరికజాతి పూనుకొననియెడ మనము కాపాడు రాజకీయ

పునస్సృష్టి నాటంకముచేయక జోక్యమెంతయు గలుగజేసికొనకుండినచో భారతీయుల శాశ్వతకృతజ్ఞతనుబడసి లోకముండునంతవరకు మనము కొనియాడుచుందుము. కాని అధికారాంధతవశమయిన విదేశీయులును భూకాంక్ష ధనకాంక్షలచే బూరింపబడిన భూపాలురును నిట్టి మహోద్యమమునకు దోడ్పడుదురనికాని సహనముగలిగి యూరకుందురనిగాని ప్రస్తుత పాలనధర్మములనుజూచి యూహింపజాలకున్నాము. వారు జాతీయపక్షమునకు నిరోధమును గలుగజేసినయెడ భారతాంగ్లేయ జాతుల కుండదగు మైత్రిత నిలువజాలదని మానవర్మకము. జాతీయశక్తి దినదిన ప్రవర్ధితంబగుచున్నది. ఈ పుణ్యశక్తి అనివార్యము. ఈ శక్తి పరిశుద్ధావేశములచే మేల్కొలుపబడినది. అనేకుల యాత్మత్యాగముచే నింతవరకు పోషింపబడియున్నవి. ఇట్టి కార్యనిర్వాహకమందు మన జాతీయుల నడవడి పాలకులచే నియమింపబడుచున్నది. మనలను దౌష్ట్యములకు ఘాతుకవృత్తులకు బురికొల్పకుందురని ప్రార్థితంబు. ఇందులకు మన పక్షమువారు విదేశములకేగి మన యుద్యమమును బోధించి ధర్మమును ప్రకటించినచో పశ్చిమనాగరక లోకము వీరిని దౌర్జన్యమునుండియు క్రూరావేశోద్రేకముల నుండియు దొలగింపగలదు.

సంఘీభావము చేతను ఐకమత్యముచేతను పరతంత్రమును పరపాలనమును విసర్జించి స్వపరిపాలన నియమించుకొనదగును.

(1) ఏజాతికయిన నుత్తమరాజ్యాంగ మెద్దియన నాజాతి యొక్క వివిధపక్షములవారి సుగుణములను ప్రజ్ఞావిశేషముల నేది పెంపొందజేయగలదో అదియే వారి కుచితపాలనము. ఒకజాతియొక్క బహుపక్షములును ముఖ్యమహామండలసభయందు ప్రతిబింబించినగాని వారందరి శక్తియుక్తుల కవకాశత యుండదు. ఇప్పుడట్టి సభానియోజక విధానమునుగురించి విచారించవచ్చును. దేశీయసంస్థానములపాలన క్రిందనుండు జనసమూహములు 63,000,000 గా లెక్కింపబడిరి. కేవలము మనప్రస్తుతాంగ్లేయపాలనము క్రింద 232,000,000 జను లున్నట్లు తెలియవచ్చుచున్నది. నియోజనాలయముల నిర్మించుటందు జనసంఖ్యయేగాని భూవైశాల్యము ప్రమాణముకానేరదని లోగడ వ్రాయబడియున్నది. మండలసభలందుకంటె మహామండలసభయం దెక్కువ ప్రతినిధు లుండినగాని వారుతమకార్యభాగమును క్రమముగా నిర్వహింపజాలరని కూడా చెప్పియుంటిమి ఇప్పుడు 2320 లక్షల జనులలోను స్త్రీలు పురుషులు బాలురు నిమిడియున్నారు. మహామండలసభయందు 500 నియోజ్యు లుండవలయునని యూహించి చూతము. జనసమూహముల నుండి 464 నియోజ్యుల నంపవచ్చును. వాణిజ్య సంఘములనుండియు విశ్వవిద్యాలయములనుండియు సాధారణ నియోజనమార్గముల నియోజ్యులనంపుకొనలేని లఘుసంఘముల నుండియు మిగిలిన 36 మంది నియోజ్యులను నియమింపదగును. ఇటుల సాధారణముగా నైదు లక్షల జనులుండు దేశభాగము లన్నియు నియోజనాలయములుగా నియమింపబడదగును. ప్రతినియోజనాలయమునకును

నియోగార్హతగల స్త్రీ పురుషుల పేర్లజాపితాలను ముందుగా తయారుచేయువలయును సర్వాధికారిచే నియమింపబడిన స్థానికనాయకులు సభగావించి జాపితాలను పరీక్షచేసి చూచి సభాంగీకారమును బొందుచుండవలయును నియోజకులందరును నియోజనాలయమునకు వచ్చి తమ "ఆదేశముల" నివ్వవలయును. నియోజకులందరొకపట్టణమున నుండక గ్రామములందు వ్యాపించియున్నపుడు నియోగస్థలముల ననేకగ్రామములందు నియమించి పాలితులఆదేశములను బోగుసేయుచుండవలయును. నియోజనము జరుగుటకుముందే ప్రజ్ఞావంతులగు ప్రజానాయకులు ప్రజలచే నెన్నుకొనబడుటకు దరఖాస్తుచేయుదురు. పత్రికలలోను సాధారణసభలలోను వారివారి ప్రజ్ఞావిశేషములను వివరింపబడును. వారి దరఖాస్తు గెజిటీలలో ప్రచురింపబడును. నియోగ్యులకొందరొక నియోగాలయమునందలి నియోజకుల "ఆదేశముల"ను దమకిమ్మని పోటీలుపెట్టుకొని తమ ఆన్వేషకులను గ్రామముల వెంటబంపెదరు. వీరింటింటికివచ్చి తమపోషకుల గుణముల వర్ణించుచు జనులను తమ ఆదేశములను తన యజమానికిమ్మని ప్రార్థింతురు. నియోజకులు తమవద్దకు వచ్చువారితో నేదో ప్రసంగించి వదలివేయుదురు, గానివారి యభిప్రాయమును వెలిబుచ్చరు. నియోజ్యులుకూడా గ్రామములవెంటవచ్చి సభలగావించి తాము బూనుకున్న పాలనాధర్మములను తనసభ్యతను విశదపరచుకొనును. ఇటుల ప్రతి నియోగ్యుడు ప్రతి నియోజకునికి దెలిసియుండును. ప్రజాభిప్రాయమువల్లను పత్రికలవల్లను వారి వారి పూర్వాచారిత్ర వృత్తాంతములను

తెలిసికొని తన యాత్మీయుం డేనియోగ్యుం డుత్తముండో యని విచారించుకొని మనోనిశ్చయము చేసికొనిన నియోజకులు తమ మతముల రహస్యముగా మనసునం దుంచుకొందురు. తన కిష్టమువచ్చినట్టుల న్యాయ మాలోచించి నియోజకులందరు తమ యాదేశముల నిచ్చుదినమున నియోగ కార్యస్థానమునకుబోయి నియోగ్యులలో నెవరిని తానుత్తమునిగా దలచునో వాని పేరొక్కటిమాత్రము చీటిమీద వ్రాసి రహస్యముగా నొక పెట్టెలో వేయును. తన యభిప్రాయ మెవరికిని జెప్పనక్కరలేదు. ఇటుల కార్యస్థానములందు వేయబడిన చీట్లను తనికీచేసిచూచి నియోగ్యు లెవ రెవరికెన్ని చీట్లు పడెనో గ్రామాధికారులు పరిశీలించి, తమ ఆలయాధికారులకు తెలియజేతురు. కార్యస్థానము లన్నిటినుండి వచ్చినచీట్లసంఖ్యలను నియోగ్యుల పేర్లను జూచుకొని మొత్తముమీద నెక్కువచీట్లెవరికి వచ్చియుండునో వానిని ఆ యాలయమునకు నియోజ్యునిగా ప్రకటింతురు. ఇట్టి నియోజ్యులందరు కూడినసభ మహామండలసభయగును. సామ్రాట్టు న్యాయము నాలోచించి తన మహామండలసభయం దొక శాసనము నియమించి మిగిలిన 36 నియోజ్యుల కాలయముల నియమించి వర్తక సంఘములు విశ్వవిద్యాలయములు లఘు సంఘములునుకూడ తమ నియోజ్యుల సంపుటకు తగు నియమముల జేయును ఇట్టి జాతీయ మహాసభ ప్రతినిధిత్వ సర్వాధికారములు గలిగియుండి దేశముయొక్క ఆదాయవ్యయములను నియమించుచు మహామండల మంతకు సంబంధించిన విషయములను మాత్రమే తర్కించుచు పలురాష్ట్రము

లందలి పాలనాపద్ధతులను పరిశీలించుటకును మంత్రులను నియమించుకొని శాసనముల జేసికొనుటకును వాణిజ్యవిషయములందును విద్యావ్యాపకమందును సైన్యపరిపాలనందును పరరాజులతో వ్యవహారించుటకును రాష్ట్రముల ఆదాయవ్యయములను నియమించుటకును మహామండలమంతయు వ్యాపింపవదగు పన్నులను నియమించుటకును రాజ్యాంగముల నేలుమంత్రుల నడవడిని కాచియుండుటకును తగియుండును. ఈ 500 తమ కాలానంతరమందు వారియధికారముల వదలుకొనిమెదరు.

(2) ఇవిట్లుండ మండలముల పాలనమును వివరించిచూతము. మేమీయాలోచనలను వ్రాయునపుడు భావిక భారత జాతీయసభల యంగస్థాపనమును నియమించు చుంటిమని తలపగూడదు. మనవారికి స్వపరిపాలనమన నెట్లుండదగునో తెలియకుండుటచే వారి కీవిషయముల వివరముగా దెలియజెప్ప నుద్యమించుచుంటిమి గాని, మేమొక స్మృతికర్తల మనిగాని అట్టిసాహసము నవలంబించుచుంటి మనిగాని తలచవలదు. ఇట్టి విషయములను పాలితులు తమంతటతామే నియమించుకొనుట స్వపరిపాలనము గనుక వాటిని నిర్ణయించి చెప్పుట కెట్టివారికిని నధికారములేదు. మన దేశమందు భాషాది భేదములచేత నార్యజాతి పలుతెగలుగ గనిపించుచున్నది. పాలితులందరు వారిని యోజ్యులు నొకభాషగలిగియుండుట రాజకీయ విషయములలో మిక్కిలి యవసరము. వంగదేశము, బొంబాయిరాష్ట్రము, పంజాబు, బర్మా, ఆంధ్రదేశము, దక్షిణదేశము, మలయాలము, మధ్యరాష్ట్ర

ములును, కాశీరాజ్యము మున్నగు మండలములు మితస్వాతంత్ర్యముతో స్థానికపాలనము సేయుచుండును. ఈమండల సభలు తమతమ రాష్ట్రధర్మముల బాలించుచు వారి స్థానికావశ్యకముల వారే సమర్థించుకొనుచుందురు. ఈమండల సభలందు పైజెప్పబడిన నియోగపద్ధతుల ననుసరించి ప్రజాసంఖ్యానుసారముగ 60-100 వరకుగల ప్రజాప్రతినిధిత్వ సభలు నియమింపబడును. ఇతరమండల సభల యధికారములకు సంబంధించినంతవరకు రాష్ట్రాంతర జనులపాలనార్థముల భంగపరుపనంతవరకు మండలసభలు స్వతంత్రము గలిగియుండును. వారి కవసరమగుచట్టముల వారే నియమించుకొందురు. మండల సభాపతుల మండలము వారే నియమించుకొనియెదరు. మండల సభాపతులందరును వారిసభికులును జనసామాన్యముల యాదేశములచే నియమింపబడుచుందురు. వారికి సేనాధికారములుండవు, మండల పాలనాధికారమును మండల సభాధిపతిచే నియమింపబడు మంత్రులు వహింతురు. మండలపాలన మొనర్చు మంత్రులు మండలసభలందలి నియోజ్యుల నుండియే ఎన్నుకొనబడుదురు. సభాపతి, సభికులు, మంత్రులునుకూడ జనులచే నెన్నుకొనబడెదరు. వీరు మూడు సంవత్సరముల కొకసారి నియమింపబడుదురు.

(3) భారతమహామండల సభాధిపతియగు సామ్రాట్టును నియమించువిధము నూహించిచూతము. సామ్రాట్టు పలు విద్యల నభ్యసించి బహుప్రజ్ఞలు గలిగిన మహాపురుషులు దప్ప వేరెవరును వారి కార్యభారమును నిర్వహింపజాలరు. ఇట్టి వారి ప్రజ్ఞప్రభావములు జనసామాన్యములచే బరిశీలింపబడ

నోపవు. గొప్ప రాజకీయానుభవము గలవారు మాత్రమే వారిని నియమింపదగును గనుక మండలసభికులు తమ యాదేశములచే గూఢముగా చీట్లపద్ధతితో తగుపుణ్యపురుషుని నియమింపదగును. ఇట్లు అన్ని మండలములందలి మండల సభ్యులచే సామ్రాట్టు నియోగింపబడుచున్నాడు. సామ్రాట్టును వారి సభ్యులునుగూడ సాధారణముగా నైదుసంవత్సరములుండి పిమ్మట తమయధికారములను తమవెనుక వచ్చువారి కప్పగింతురు.

(4) మహామండల సభవారి కార్యభారమమితమైయుండుటచేతను కార్యనిపుణులుకాని జనసామాన్యములచే నెన్నుకొనబడువారు తమనియోజకుల మతముల నవలంబించి జనసామాన్యములకుండు ఆవేశోద్రేకములచే కార్యభంగము గావింపకుండ వారియధికారమునకు తోడుగా మరియొకసభయుండినచో బాగుండునని యోచించి ప్రతిదేశమువారును రెండవ మహామండల సభనుగూడ నియమించుకొనుచున్నారు. ఇట్టిసభయందు గొప్పయనుభవజ్ఞులు మాత్రమెయుండెదరు. ఉద్యోగానంతరమందు మండల సభాపతులును, మండలన్యాయాధిపతులును (Judges) గొప్ప సేనాధిపతులును, సామ్రాట్టుగా నుండినవారును, పరదేశములకు రాజ్యప్రతినిధులుగా నంపబడినవారును, రాజకీయ విషయములందు కీర్తిగాంచిన మహాపురుషులును తమ జీవితమున్నంతవరకు సభనలంకరించి తమ బహుప్రజ్ఞా విశేషముల మాతృభూమి కర్పించుచుండనగు. ఈసభను తొలగించుట కెవరికి నధికారముండదు. వీరు జ్ఞాసధీరులును కార్యనిర్వాహకములందు కీర్తిగాంచినవారును

నగుటచే మహామండల సభయందు సమ్రాట్టు సహితముగా నంగీకరించి నియమించిన చట్టములు వీరియనుమతినిగూడ పొందనిదే సార్థకములు గాజాలవు. సామ్రాట్టుతోను దేశీయ నియోజ్యులతోను గూడిన మహామండలసభ పాలనమునంతయు జేయుచుండినను తద్విషయములను ప్రాజ్ఞసభయందును జర్చించబడును. వారిసలహాను బొందుచున్నను మహామండల సభ స్వతంత్రమును గలిగియున్నది. వీరిలో నెవ్వరైనను జనానుకూలురు కానియెడ వానినెన్నుకొనినవారు వానినిదొలగించి మరియొకరిని నియమించుకొనగలరు. ఓటర్లే సర్వాధికారులు. వారియభీష్టములే దేశముల నేలుచుండును.



